# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్త్రిక

సంపాదకుఁడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౧౨]    నవంబరు 1948    [సంచిక ౧౧




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైనను ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయముమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒక్కేపక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.




క్షౌరము చేసుకొనుటకు నేనిప్పుడు భయపడను. కేరళ షేవింగు స్టిక్ చేతికందు బాటులో వుండగా భయ మెందుకు? సుప్రసిద్ధమైన ఈ క్షౌరపు కోపుకు బిరుసు గడ్డమయినా ఫరవా లేదు. దాని హెచ్చైన నురుగు కమ్మటి వాసనే ఎల్లరకు ఆప్యాయముగ చేయుచున్నది.




KERALA SOAP INSTITUTE * CALICUT

# విషయసూచిక





పు ష్పాం జ లి




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

---

# జయపూరు కాంగ్రెసు అధ్యక్షులు : డా. పట్టాభిగారు

★ ★

డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యపంతులుగారు రాబోవు జయపూరు కాంగ్రెసునకు అధ్యక్షులుగా అధికసంఖ్యాకులచే నెన్నుకొనబడినందులకు యావద్భారత దేశమున్నూ వారి నభినందిస్తున్నది. ముఖ్యంగా దాక్షిణాత్యులు తమలోనుండి నేటికి అయిదవఅధ్యక్షు డెన్నుకోబడినందుకు సంతోషిస్తున్నారు. ఇక ఆంధ్రులసంగతి చెప్ప నక్కరలేదు; గతశతాబ్దాంతంలో (1891) కీ॥ శే॥ పనప్పాకం ఆనందాచార్లుగారైన తర్వాత ఈ 65 సం॥ల కాంగ్రెసుచరిత్రలో తిరిగీ ఆ పదవి నలంకరింపగల్గిన ఆంధ్రుడీయనే. కావున వారి ఆనందానికి మేరలేదు. వీరందరితోపాటు మా "గృహలక్ష్మి" యు ఉజ్వలస్వాంతయై కాంగ్రెసు నూతనాధ్యక్షులైన శ్రీడాక్టరు పట్టాభిగారికి మంగళహారతు లొసంగి, వీరగంధ మందించుచున్నది.

దేశసేవాధురంధరుడైన ప్రతి భారతీయుడున్నూ - ఇన్నాళ్లుగా - అభిలషింపదగిన ఉత్తమోత్తమపదవి, ఇది. స్వాతంత్ర్యసిద్ధి అనంతరం ఈపదవి నామమాత్రమై, అలంకార ప్రాయమైనదని కొందరు అపోహపడుతున్నారు. రాజ్యాధికారపదవులందిన మంత్రులచేత

స్వాతంత్ర్యపోరాటం సాగించిన కాంగ్రెసుసంస్థ గుంజీలు తీయించడం లేదేమని ఇట్లనే వారి జుగుప్స. అట్టిచర్యలు న్యాయమూ కాదు, నాజూకూగాదు. కాని అందుచేత నామమాత్ర మైనదా ఈ పదవి? లేదు, లేదు! యావద్భారతదేశానికి—పాకీస్థాన్ ప్రాంతాలు మినహా—అధికారముద్ర వహించిన ప్రధాని నెహ్రూ అధ్యక్షులైన పట్టాభిగారిని, ప్రథమ సందర్శనంలోనే, ఏమని అభినందించారో గమనించండి. "తాము రాష్ట్రపతులైనారు; ఇక ఎల్లరమూ మీకు మోకరించవలసినదే."

దీనినే పట్టాభిగారు రాజాజీహాలులో మిత్రులు గౌరవించినసందర్భమున ఛలోక్తిగా "గృహలక్ష్మి" పరిభాషలో ఇట్లన్నారు: "అత్తగారు ఎల్లప్పటికీ అధికారం ఛలాయించు చుండజాలదు, కోడలు వచ్చినతర్వాత ఎప్పుడో ఒకప్పుడు ఆమెకధికారం దత్తంచేయ వలసిందే."

కోడలి కధికారమప్పజెప్పినమాత్రాన అత్తగా రధికారచ్యుతురాలు కాలేదు; కాదు. అత్తాకోడండ్ర సంబంధబాంధవ్యాల నరయ నవకాశంలేని పురుషులెవ్వరో అనుకోవాలి; 'కోడలి కధికారమప్పజెప్పినఅత్త తోత్తే' అని. నిజానికామె, కోడలికి ఇంటిపనులు మెళుకువతో చక్కపెట్టడమే అప్పచెప్పినది. అత్తగారికి వంగి చీపురుకట్ట చేత పట్టుకోను ఓపికఉన్నంతకాలం ఆమె అధికారమేమీ చెక్కుచెదరదు, ఏమంటే ఆచీపురు నెందుకైనా ఉపయోగించగలదామె! అట్లని చీటికిమాటికి కోడలిచేతి కడ్డంరాదు ఆమెకు తగుమైన స్వతంత్రమిచ్చి- భర్తతో సంప్రతించి, అత్తభయంతో, గృహనిర్వహణం చేయ నిస్తుంది ఎల్లరికి తనఎదుట, తనకోడలిని గౌరవించడం, మన్నించడం నేర్పుతుంది. కోడలు తప్పటడుగులు వేసినప్పుడు వంకలుతీర్చి దిద్దుతుంది.

కావుననే పైఛలోక్తి అనంతరం పట్టాభిగారిట్లాఅన్నారు. "కాంగ్రెసుసంస్థ శాసన సభాపార్టీ కధికారమప్పచెప్పడం నేర్చుకోవాలి. పార్టీ మంత్రివర్గాన్ని నడుపుతుంది. మంత్రివర్గానికి బలంపార్టీ. ఆపార్టీ దారితొలిగినప్పుడే, కాంగ్రెసు జోక్యంతీసుకొని దానిని దారిలో నిలువపెడుతుంది." అందుకనే, నెహ్రూప్రధాని "దాసోహం" అనగానే, "దాసదాసోహం" అనక, కాంగ్రెసు అధ్యక్షులు పట్టాభిగారు, "ఆవిషయం త్వరలో చర్చించి రూపింతాము." అని హుందాతో, సరసంగా జబాబుచెప్పారు,

డా. పట్టాభిగారు అధ్యక్షులైనందుకు మహిళాలోకమంతా ఉత్సాహంచెందవలెను. మనదేశంలో రాజకీయోద్యమానికి పూర్వస్థితి సాంఘికోద్యమం. ఆ ఉద్యమానికి సంఘ సంస్కరణం మూలకందం. అందు ముఖ్యంగా స్త్రీజనోద్ధరణ ఆయువుపట్టు. దీని

నా రోజులలో ప్రారంభించినవారు శ్రీ వీరేశలింగంపంతులుగారు. వారి ప్రథమశిష్యులు శ్రీ రఘుపతి వెంకటరత్నంనాయుడుగారు. వారిచేతిక్రింది శిక్షలదీరిన మొదటి కుర్రజట్టు నందలి ముఖ్యులలో నొక్కరు పట్టాభిగారు వీరు నా డవలంబించి, ఆచరించి, ప్రచారం చేసిన సాంఘికస్వేచ్ఛా విశృంఖలమట! నాడు ఉడుకుమిడుకు ఉద్రేకియైన యువకుడు పట్టాభి, నేడు కాగిచల్లారినపాలు! ఈ శతాబ్దారంభంలో పట్టాభిగారు "ఆంధ్రభారతి" యందు "సమిష్టికుటుంబవిధానము"ను చెరిగి, విమర్శించివ్రాశారు. నేడు,దానినే, కుటుంబ మందలి యువతీయువకులు ఉత్తమ సంసారులగుటకు శిక్షణాలయంగా భావిస్తున్నారు. ఈవిధంగా సంఘసంస్కరణలో అనుభవంమీద నిజపథం గుర్తించిన పండితుడాయన.

నేడు స్త్రీపురుషులకు సకలవ్యవహారాలలోను భేదంనశించింది. నూతనరాజ్యాంగ చట్టం దీనిని స్థిరపరుస్తున్నది. అందుచేత స్త్రీకిన్నీ పురుషునితోపాటు హక్కులూ, బాధ్యతలు విస్తారమైనవి. స్త్రీ పోరాటంలేకుండానే ఆహక్కులనుభవిస్తూ, ఆబాధ్యతలు నిర్వహించవలెనంటే, ఆమెకు పురుషుడు సంపూర్ణసహకారంచేయాలి. అయితే ఆ సహకారంచేసే పురుషుడామెను లక్ష్యసిద్ధికై - కికారణ్య బ్రహ్మారణ్యాల కంటకావృతమైన దారులలోగాక, మెత్తని పచ్చికబాటల నడిపించవలెనంటే, స్త్రీలఅభివృద్ధి కనుకూలుడైన అనుభవజ్ఞుడు, ముదిమదితప్పనివృద్ధు, కావాలి. అందుచేతవివిధరాష్ట్రాలలోను,యూనియన్ లోను కాంగ్రెసుప్రభుత్వాలు సాగుతూండగా - చిరకాల సంఘసంస్కర్త అయిన పట్టాభి గారివంటి ఉత్తమగృహస్థు కాంగ్రెసుఅధ్యక్షుడు కావడం గృహలక్ష్ముల నోములపంట. వీరి ప్రోత్సాహముచే అనేక సాంఘిక శాసనములు తీర్మానమై అమలు జరుగుగాక.

, నిజానికి నేడు కాంగ్రెసు అధ్యక్షపదవి - భారతయూనియన్ ప్రధానిపదవికన్నా, గవర్నర్ జనరల్ పదవికన్నా, మహోన్నతమైనదని మా అభిప్రాయం. వీరికి పూర్వులైన అధ్యక్షులందరినీ గాంధీమహాత్ములు నిరంతరము తోడునీడలై నడిపించియున్నారు. వారులేమి, నేడు వీరిబాధ్యత ఇనుమడించినది. అయితే ఆ పదవి నధిష్ఠించి నిర్వహించడానికి, తగిన ప్రజ్ఞ, ప్రతిభ, ప్రాభవం, ప్రావీణ్యం, ప్రభుత్వం, గురుత్వం మొదలైనవన్నీ ఆయనయందు చిరకాలంగా సుప్రతిష్ఠతమై ఉన్నాయని మా విశ్వాసం ఇందుల కాయన కీశ్వరుడు చిరకాలాయురారోగ్యైశ్వర్యములిచ్చి బ్రోచుగాక.



दीपावलीका शुभ अवसर पर 'गृहलक्ष्मी' पढनेवालों केवास्ते कुछभी लिखनेमें मुझे बहुत आनन्द प्राप्त होता है।

प्रथमतो हिंदकी आझादी प्राप्त करनेमें अपनी स्त्री समाजने जोकुछ मदद की हुई है उसकी नोंध करना आवश्यक है। अपना अथाग परिश्रम और धैर्यसे हमारे स्त्री समाजने आज प्रान्त गवर्नर, मध्यस्थ सभाका सचिव, और बडे देशोंका हिन्दी दूतका स्थान प्राप्त किया है।

बहिनों, औरभी भविष्यमें अपने देशकी उन्नती के कार्यमें स्त्री समाज के सभी क्षेत्रोंमे अधिक सेवा करनी होगी। खास करके अपनी दुर्भागी बहिनों की सामाजिक उन्नती करनेका कार्य अत्यन्त आवश्यक है, की जो दुर्भाग्य के लिये वह जिम्मेदार नहीं है।

मै कहना चाहती हूं की आप ऐसा, ख्याल न करें की समाज में गृहलक्ष्मी और सुमाताका कार्य की जो बहुत आवश्यक है। वो भूलाया जाय। क्योंकी एक गृहलक्ष्मी और सुमाताहि स्त्रीयोंकी उन्नतीका सामाजिक कार्य अछी तरहसे कर सकती हैं।

सामाजिक सेवाका कार्य मात्र सामाजिक संस्थाओंसे नहिं हो सकता है। अर्थात सुगृहिणी और सुमाता शुरूसे शिक्षण देते वख्त अपना घरमें सादा जीवन और उच्च विचारों का पाठ बालकों को पढा सकती है। यह शिक्षणका पाठ वह अपने पडोसीओंमें भी सिखला सकती है। इस प्रकारसे धीरे धीरे अपनी सेवाका क्षेत्र विशाल कर सकती है।

इस प्रसंग पर गृहलक्ष्मी के तन्त्री और पाठकोंको दीपावलीका मेरा हार्दिक अभिनन्दन।

विजिया बा

महाराणी, भावनगर।

# శ్రీ మద్రాసు గవర్నరుసతి దీపావళిసందేశం

దీపావళివంటి శుభసమయంలో "గృహలక్ష్మి" పాఠకులకోసం కొంచమైనా వ్రాయడమంటే నాకు చాలా ఆనందం కలుగుతూవున్నది.

మొదట హిందూదేశం స్వాతంత్ర్యంపొందడంలో స్త్రీసమాజంచేసిన సేవను, సహాయాన్ని ఎంతైనా పొగడవలసిన అవసరంవుంది. తమ అగాధపరిశ్రమతోను, ఎంతో ధైర్యంతోను మనస్త్రీలు నేడు ప్రాంతీయగవర్నరుగాను, ప్రాంతీయసభా మంత్రులుగాను, గొప్పగొప్పవిదేశాలలో హిందూదేశపు దూతలుగాను ఉన్నతస్థానాలను ఆక్రమించుకున్నారు.

సోదరీమణులారా! స్త్రీసమాజం ఇంకనూ మునుముందు, దేశోన్నతికై అన్ని క్షేత్రాల్లోను అధికంగా సేవచేయవలసివుంది. ముఖ్యంగా దౌర్భాగ్యపుస్థితిలోనున్న మన అక్కచెల్లెండ్రను సమాజంలో ఉన్నతస్థితికి తీసికొనిరావలసిన అవసరం ఎంతైనాఉంది. ఎందుకంటే ఆ దౌర్భాగ్యానికి వారు బాధ్యులుకారు.

సమాజంలో స్త్రీలు గృహలక్ష్ములుగాను, యోగ్యులైన తల్లులుగాను ఉండవలసినఅవసరం ఎంతోకలదన్న విషయం మరువరాదని నేను చెప్పగోరుచున్నాను; ఎందుకంటే గృహలక్ష్ములు మరియు యోగ్యులైనతల్లులున్నే సమాజంలో స్త్రీలఉన్నతికై చక్కని కృషిచేయగలుగుతారు.

సాంఘికసేవాకార్యక్రమాన్ని కేవలం సామాజికసంస్థలుమాత్రమే నిర్వహించలేవు, అనగా ఉత్తమగృహిణులు, సుయోగ్యులైనతల్లులు తమఇంట్లో బాలకులకు ప్రారంభశిక్షణ నిచ్చేటప్పుడే, సామాన్యజీవితమును, ఉన్నతాశయాలనుగురించి బోధించగలరు. ఇంతేకాక, ఈ పాఠాలను ఇరుగుపొరుగువారికిగూడ నేర్పగలరు. ఇదేవిధంగా నెమ్మదినెమ్మదిగా తమ సేవాక్షేత్రాన్ని విశాలంచేసుకోగలుగుతారు.

ఈ సందర్భంలో, "గృహలక్ష్మి" సంపాదకులకు, పాఠకులకు నరకాసురవధకై నా హృదయపూర్వక అభివందనాలు.

విజియాబా

మహారాణీ, భావనగర్.



# శ్రీమతి భోగరాజు రాజేశ్వరమ్మగారు



"మా జానకీ చెట్టబట్టగా, మహారాజవైతి"

అని కీర్తించినాడు లోకైక ప్రభువైన శ్రీరామచంద్రమూర్తి వారిని, మహాభక్తాగ్రేసరుడైన త్యాగరాజు! అట్లా అనడం - శ్రీరామచంద్రమూర్తిని చిన్నబుచ్చడ మవుతుందా? జనకరాజ తనయ పాణిగ్రహణం విలువగట్టడమే అవుతుందిగాని!

అలాగే, శ్రీమతి రాజేశ్వరమ్మగారిని చెట్టబట్టి మహారాజాధిరాజ పదవులను తలదన్నే కాంగ్రెసు మహాసభాధ్యక్షపదవికి పట్టాభిషిక్తుడైనావని డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారినంటే - వారిని చిన్నబుచ్చడ మవుతుందా? కీ॥ శే॥ గంజాం వెంకటరత్నంపంతులుగారి కుమార్తె రాజేశ్వరమ్మ పాణిగ్రహణం విలువకట్టడమవుతుంది గాని!

గంజాం వెంకటరత్నంపంతులుగారు 1870 ప్రాంతంలో జన్మించారు 20 వ సం॥ము వచ్చేసరికి ఆ నాటి ప్లీడరు పట్టాపొందారు. రెండు చేతులా పదేళ్లు సంపాదించారు 30 సం॥నే ప్రాక్టీసు మానేశారు. ఒక్క సం॥ పాటు రాజకీయ విషయాలు క్షుణ్ణంగా చదువుకున్నారు. మరి 10 సం॥లు కాంగ్రెసు రంగంలోను, శాసనసభా రంగంలోను, ప్రజాసమావేశ రంగంలోను - ప్రజాహితార్థమై కృషిచేశారు. 40 వ సం॥ ప్రాయము వెళ్లీ వెళ్లకముందే 1910 సం॥ జూలై నెలలో దివంగతులైనారు. ఇంకా 10 కాలాలపాటు బ్రతికేఉంటే కాంగ్రెసు అధ్యక్షుడూ అయ్యేవాడు, మద్రాసు ప్రధానీ అయ్యేవాడు - ఇంకా ఏమేమయ్యేవాడో?

ఆయనకు ప్రథమ సంబంధం కుమార్తె శ్రీమతి భోగరాజు రాజేశ్వరమ్మగారు.

శ్రీయును కులమును రూపును
ప్రాయము శుభలక్షణంబు బాంధవ విద్యా
శ్రేయముగల వరునికిఁ క
న్యాయుతుగా జేయవలయు నధిక ప్రీతిఁ.

అని పూర్వులు వరాన్వేషణమునకు మార్గము నిర్ణయించారు. ఇంగ్లీషుచదువులు, వాటివల్ల సంపాద్యములు,- ఏర్పడుతున్న రోజులవ్వి అంచేత నాటి రోజుల్లో - వెంకటరత్నంగారివంటి పెద్దలు - పూర్వులు పైపద్యంలో నిర్ణయించిన జాబితాలో - ముఖ్యంగా విద్యకు ప్రాధాన్యమిచ్చి - సిరి చిన్నచూపు చూచినా మిగతవన్నీ ఉన్నట్లైతే పిలిచి పిల్లనిచ్చి పెండ్లిచేశేవారు. సిరి దానంతటదే లభ్యమయ్యేది! అలాగే పంతులుగారు కాలేజీల వెంటబడి, వెతికి వెతికి - ప్రెసిడెన్సీ కాలేజీలో - బోలు - పట్టాభి సీతారామయ్యగారిని చూచారు

సీతారామయ్యగారు గుండుగొలను కరణంగారి రెండవ కుమారుడు చిన్నక్లాసుల్లో ఏమి స్కూలు జీతం ఇచ్చుకున్నాడో గాని.. స్కాలర్ షిప్పులతోనే విద్యంతా గడిస్తున్నాడు. వెంకటరత్నం పంతులు గారికి విద్య, సంపాదించే సామర్థ్యమేగాక - తనవలెనే ప్రజాహిత కార్యచింతకూడా కలవాడైతే బాగుండునని అంతర్యంలో సహజంగా ఉంటుంది అప్పటికే పట్టాభిగారు - ఏ విషయంమీదనైనా కొట్టిన పిండిలా ఉపన్యసించేవారట! అంచేత పెద్దలు నిర్ణయించినట్లు సర్వలక్షణ సంపన్నుడని మురిసి శ్రీమతి రాజేశ్వరమ్మగారినిచ్చి వివాహంచేశారు. దానితో పట్టాభిగారి జీవితమొక్క క్రొత్త మెట్టెక్కినది.

శ్రీ వెంకటరత్నం పంతులుగారికి రెండవ సంబంధానికికూడా స్త్రీ సంతానమే పురుష సంతు లేకుండానే వారు గతించారు. అంచేత - ఆయన ఆస్తి అల్లుండ్లిద్దరికీ - సంక్రమించిందంటారు. అయితే వెంకటరత్నంగారివల్ల పట్టాభిగారికి దక్కినది కేవలం మామూలు ఆస్తికన్నా విలువైనది. వారి అమూల్యమైన రాజకీయపుస్తకభాండాగారం అందులో ముఖ్యమైనది. నాటిపెద్దలైన - న్యాపతి సుబ్బారావు పంతులు, మోచర్ల రామచంద్రరావు పంతులు, నెమలి పట్టాభి రామారావు పంతులు మొదలైన తెలుగు నాయకులు, సుందరయ్యర్, శివస్వామి

అయ్యర్, శ్రీనివాసశాస్త్రి, వెంకట్రామశాస్త్రి మొదలైన తమిళనాయకులు, - బిసెంటు మున్నగు దేశీయనాయకులు - ఆయనకు పరిచయమైనారు ఆ పెద్దల వెనుక పిన్నగా కష్టించి రాజకీయాల కృషి చేయడానికి అవకాశం కలిగింది, దేశసేవాభిలాష కలిగింది. మామగారివలెనే, 10 సం॥ల మెడికల్ ప్రాక్టీసుతో పుష్కలంగా సంపాదించి - ఇక వృత్తి విసర్జించారు; ప్రజాహిత జీవన మారంభించారు.

గమనించ దగిన మరొక్క విశేషమున్నది. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసుకమిటీని - 1917 లో బిసెంటు, గాంధీల వాదనలకు ప్రతివాదనలనొనర్చి భగీరథప్రయత్నంచేత సాధించి తెచ్చినది పట్టాభి గారే. అయితే- 1937లో ప్రకాశం, సాంబమూర్తి గార్లు పదవులలంకరించి - పిలిచి ఇచ్చేదాకా - ఆ కమిటీ అధికారపదవి నాశించలేదు. 1937 లో మంత్రి పదవిని కాదన్నాడు, 1939 లో మళ్లీ కాదన్నాడు. అప్పుడు, సరేనంటే, ప్రధానమంత్రే అయ్యేవాడేమో ! కాళ్లవద్దకువచ్చిన ఆంధ్ర విశ్వవిద్యాలయపు ఉపాధ్యక్ష పదవినికూడా 1938 లో కాలదన్నేశాడు 1946 లో గాంధీమహాత్ముడు నీయిష్టమన్నా, ప్రధానమంత్రి పదవిని, పార్టీ యివ్వనున్నపుడు నిరాకరించాడు ఆఖరుకు రాజాజీ అంతవానికి "ఏమిటీ! కాంగ్రెసు అధ్యక్షపదవి ఇస్తానన్నా వద్దనేట్లున్నావు ?" అనిపించేట్లు వ్యవహరించాడు ఎక్కడనుంచీ వచ్చిందీయనకీ పదవీనిరాకరణశక్తి ? అదీ వెంకటరత్నంపంతులుగారి చలవే నాటిరోజులలో - మద్రాసు మహాజనసభాధ్యక్ష, ఉపాధ్యక్ష, కార్యదర్శి పదవులకు హేమాహేమీలు పోటాపోటీలు పడేవారు. మద్రాసుపెద్దలు - ఉపాధ్యక్షునిగా శ్రీ వెంకటరత్నంపంతులుగారి నెన్నుకొని, అంగీకరించండని ప్రార్థిస్తే- సులభసూక్ష్మంగా నిరాకరించేశారట. ఊరక నిరాకరించారూ, నాటి మహాజనసభ స్థితిగతులను తీవ్రంగా విమర్శించారటకూడా. అట్లాచేశారని హిందూపత్రికకుకూడా కోపమువచ్చి - ఆయనచర్యను విమర్శిస్తూ ప్రధాన వ్యాసంవ్రాసినా- ఆ ధీరుడు చలించలేదు.

డాక్టరుగారు వైద్యపరీక్షనిచ్చి, వృత్తి ఎక్కడ సాగించడమా అని ఆలోచిస్తున్నప్పుడు - ఒక గొప్ప జమీందారు ఆయనను తన ఆస్థానవైద్యులుగా రమ్మని ఆహ్వానమంపినాడట. కోరిన జీతమిస్తానన్నాడట. కాని వెంకటరత్నంపంతులుగారు - "జమీందారుల పొత్తు నీకుతగదు సేవ అంతకన్నా తగదు" అంటూ పెద్దఉత్తరం వ్రాశారట దానితో ఆ ప్రయత్నం విరమించారు. బందరులో స్వతంత్రంగా ప్రాక్టీసు పెట్టారు. ఈ విధంగా సహజంగా విద్యాశక్తి, ప్రతిభ, స్వాతంత్ర్యనిరతి - గల పట్టాభిగారికి - వాటన్నిటిని పెంపొందించుకొని, ప్రకాశించి, నేడు కాంగ్రెసు అధ్యక్షపదవి నలంకరించే అవకాశం కలుగజేసినది, హెచ్చుగా శ్రీ వెంకటరత్నం పంతులుగారి బాంధవ్యం అంటే పట్టాభిగారికి పరువుగాని వేరుకాదు ఇక ఇవంతా - రాజేశ్వరమ్మగారి చేతి చలవఅంటే - పొరబాటేముంది ?

ఇక, శ్రీమతి రాజేశ్వరమ్మగారు అట్టి తండ్రికి తగిన తనయ, ఇట్టిభర్తకు తగిన భార్య కావడమే ఆమె విశేషము. ఆమె ఆ కాలాన్ననుసరించి, మూడవఫారం వరకు కాకినాడలో పుట్టింట విద్యనభ్యసించినది ఈ కాలంలో గృహనిర్వహణానికి కావలసిన మేరకు ఆంగ్లభాషాజ్ఞానమున్నదట. ఈ శతాబ్దారంభంలో ఆంధ్రభాషలో విజ్ఞానచంద్రికా గ్రంథమండలి, ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల మొదలైన ప్రచురణ సంస్థలెన్నో విరివిగా ఉత్తమగ్రంథాలనువ్రాసి ప్రచురించాయి. వాటిని చాలావరకు ఒకసారైనా తిరుగవేసి ఉంటుందామె. ఈ 50 సం॥లుగా భర్త ప్రవేశింపని సముద్యమం లేనేలేదు. ఒక్క సుషుప్త్యావస్థలోతప్ప నిరంతరం మాట్లాడనేర్చిన భర్త, హాస్యము, అపహాస్యములందైనా, ఉద్బోధకరంగానేగాని, పొల్లు మాట్లాడనేర్వనిభర్త; అట్టి భర్త సాహచర్యంలో విన్నదంతా, విద్యే.

డాక్టరుగారు సామాన్యంగా పిల్లలకు పెద్దలకు వచ్చే అల్పస్వల్ప వ్యాధులకు - తగువైన మందుల పట్టీలువ్రాసే ఉంచుతారు. వాటినిబట్టి మందులు తెప్పించి వాడుతుంటుందామె. తనచేయి మించినదైతే, మెళుకువతో గ్రహించి, తగినవైద్యుని పిలువనంపుతుందట.

పిల్లలు ఎదిగి-తమకు 'అదికావాలి, ఇదేకావాలి' అనేదాకా, ఉడుపులు, వస్తువులు- నిర్ణయించడం, కొనడం, కుట్టించడం మొదలైనవన్నీ ఆమె పనులే ఒకవిధంగా వారి అభిరుచులు రూపించడం, గమనించడం, వంకలుదిద్దడం ఆమెచాకచక్యము పట్టాభిగారు 1915 నుంచి వృత్తి విసర్జించి రాజకీయాలలో వ్యవహరిస్తున్నారు. భారతరాజకీయాలంటే నిరంతర సంచార ప్రచారాలతో కూడుకొన్నవి 1916 నుండి అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యులు. 1929 నుండి వర్కింగు కమిటీ సభ్యులు 1930 లో 1 సం॥ము, 1932-34 లు 2½ సం॥లు, 1941-42 సం॥ము, 1942-45లు-3సం॥లు మొత్తం 7½ సం॥లు జైలువాసం 1936లో సంస్థానముల ఉద్యమం చేబట్టినారు ఈ 12 సం॥లుగా ఆయన సంచారం, ప్రచారంచేయని సంస్థానంలేదు. ఇక రాష్ట్రంలోనే, బందరు జాతీయకళాశాల, సహకారపరపతిసంఘాలు, భూమి తణఖా బ్యాంకులు, సాదాబ్యాంకులు, భీమా కంపెనీలు, అఖిలభారతచరఖాసంఘము, ఇట్లు ఎన్నో నిర్మాణసంస్థలకు, విఘ్నేశ్వరపూజ మొదలు, ఉద్వాసన అయ్యేదాకా (?) ఆయనదే అధ్వర్యము. ఈ విధంగా బహుకార్యలంపటుడై, ఇంట కాలునిల్వక నిరంతరమాయనసంచారంచేస్తుంటే, రాజేశ్వరమ్మగారు మెళుకువతో ఇంట్లో సకలమూ సర్దుకొనిపోతూంటారు.

చాలామంది కాంగ్రెసునాయకులవలె ఆయనిల్లు 'అయ్యవార్లనట్టిల్లు' గాదు ఆయన సంసారనిర్వహణ పద్ధతి—"ఆచార్లవారి అశ్వం ఎప్పుపోతే అప్పు" —అనేదికాదు. అంటే ఆయన త్యాగి కాదని సాహసి కాదని కాదు నా అభిప్రాయం ఆయనిల్లు సిరిసంపత్తులతో తులతూగుతుంటుంది. ఇంటినిండా కొడుకులు కోడండ్రు, మనుమలు మనుమరాండ్రు కళకళలాడుతుంటారు ఇంత సంసారం నిర్వహిస్తూ ఎవరినీ 'దేహి' అని చేయిజాచకుండా ఈ33సం॥లుగా నిరంతర సంచారప్రచారాలు సాగిస్తున్న అభిమానధనుడాయన. అయితే-

"పరహితమతి యుతులగు
దొరలకు నడుగుటయు
నోడలితోడవులు పుడమిన్."

అన్న భాగవతోక్తి ననుసరించి- 1910 నుండిన్ని- ఆంధ్రజాతీయ కళాశాలకై దీపావళిభిక్ష నాంధ్రదేశమంతటా యాచించినాడు

గాంధీ-పాఠశాలా బహిష్కారం ప్రవేశపెట్టినది లగాయతు తన బిడ్డలను స్వదేశంలో ప్రభుత్వపాఠశాలల కంపలేదు; విదేశాలకు ఉన్నత విద్యకంపలేదు అట్లని వాళ్లను దిప్పకాయలను చేయలేదు ప్రయోజకులైన విద్యావంతులను చేశారు, ఇవన్నీ కొనసాగాయంటే- తల్లి, తండ్రీ తానే అయి రాజేశ్వరమ్మగార్లు ఇల్లు నిర్వహించడం చేతనే.

పట్టాభిగారు బాహుళ్యంమీద ఆదర్శవాదియై సిద్ధాంత రాద్ధాంతాలెంతగా చేయగలరో, అంత సూక్ష్మాతిసూక్ష్మంగా ప్రతీవిషయం పరిశీలిస్తారు. దేన్నీ పరాకుగాచూడరు, చూచినది ఎన్నటికీ మరచిపోరు. ఇంట్లో ఏవస్తువువృధాపోదు. పత్రికలపైన వచ్చే కేపర్లు సహా జాగ్రత్తపరచి వ్యాసాల చిత్తుప్రాసుకుంటారు. అంత పొదుపుగలవారి భార్య బ్రతుకు ఎంత కత్తిమీది సామో ఇల్లాండ్రకు చెప్పనక్కరలేదు. ఆమె ఆ పరీక్షలో - డాక్టరేట్ పొందిందనే చెప్పవచ్చు.

'పట్టాభిగారు లెక్కపద్దు అంటే నిక్కచ్చి మనిషి' అని, ఆయనమీద ఒక పెద్ద అపవాదు! ఇలాంటివారు ఇంటా, బయటా వకటే ఇల్లాలు దుబారా చేయకపోయినా, లెఖ్ఖపద్దు నిక్కచ్చిగా చూచే భర్తతో వేగడం చెడ్డకష్టం!

ఎంతోమంది, ఎన్నోబాపతులధనం ఆయనవద్ద దాస్తుంటారు. ఏపద్దుకాపద్దే- పొట్లంకట్టిఉంటుంది; దాని జమాకర్చు దానికిందనే ఉంటుంది ఏరోజున ఏవేళటప్పుడువచ్చి, అడిగినా-అణాపైసలతో లెఖ్ఖచెప్పి నిలువతేల్చి అప్పగించేస్తారుట. అయితే, తన పోగపుల పెట్టెలో - ఆవాలు, జీలకర్ర మెంతులు ధనియాలు, కలిపేస్తే తనకెంతచిరాకో,-తనభర్త గుర్తుగా పెట్టుకొన్న డబ్బుదొంతర్లు కలగాపులగమైతే ఆయనకూ అంతచిరాకు - అని ఇల్లాలికి తోచకపోతే - పైవిశేషపద్ధతి ఏమగవానికైనాసాధ్యమా? గతవారం పత్రికలన్నీ వరుసగాపెట్టి గంటసేపుతాళిచూస్తే- అవి పెట్టినవరుసన ఉండవనే సంగతి - యువక దంపతులందరికీ ఎరుకే!

(701-వ పుట చూడుడు)

# శిథిలంలోని శోభ!

శ్రీమతి విల్లూరి నాగభూషణాదేవిగారు

ఎడారిలోని పక్షి
లాంటి నా హృదయం
లోతైన నీ కళ్ళల్లోంచి
నీలమైన ఆకాశాన్ని
చూశేశింది.

నీ కళ్ళల్లోని గుండ్రని
మేఘాల్ని జీల్చుకుంటూ
చుట్టూవున్న సూర్యకాంతుల్ని
తేట తెల్లంగా జెదరగొడ్తూ
ఆనందంగా, సంతోషంగా, యెగిరి
ఆడుకుంటూ!

అందమైన, నీ చల్లని
చూపులలో, నా హృదయం
ప్రాతఃకాల భాస్కరుని
ప్రభాత జ్యోతుల్ని
చూశేశింది.



నీ నయన ద్వయాతే
నా హృదయంలోని
నక్షత్ర మండలం;

నా పాటలు

నీ కళ్లయొక్క లోతులో
మునిగి మునిగి
మరుగైపోతున్నాయి;

నీ ప్రశాంతమైన చూపుల
అఖండ మిను వీధిలో
ఒంటరి బాటలోని
మౌనమైన మూర్తిత్వంలో,
నేను హాయిగా, వుల్లాసంగా,
తిరుగుతా!




శ్రీమతి సరస్వతి చెన్నకేశవన్ గారు ఎం. ఏ.

# మానసిక వ్యాధులు—పరధ్యానము, మందమరుపు

గోవిందుడు, ధనికులయింటిబిడ్డ. ఇంట్లో కష్టము అన్నది తెలియకుండా పెరిగాడు. తల్లికిగాని తండ్రికిగాని, అట్టే చదువులేకపోయినా, తెలివిగలవాడు. పిల్లవాణ్ణి 5 ఏండ్లకు బళ్లో వేసారు. ఇంట్లో ఎంతో తెలివితేటలు కనబరుస్తూ చురుకుగా వుండేవాడు. చదువు బాగా వస్తుందనుకొన్నారు. కానీ బడికెళ్లాక చదువు అసలు రాలేదు సరిగదా, ఏదో ఎప్పుడూ పిచ్చివాడులా పరధ్యానంగా వుండటం ఆరంభించాడు. తక్కువపక్షం ప్రతితరగతిలోను మూడేళ్లు కూచునేవాడు. 20 ఏండ్లకుకూడా స్కూలు ఫైనల్ ముగించలేదు. బజార్లకెళ్లి సామాన్లుకొనడం, ఇంటి విషయాలు చక్కబెట్టడం, ఏమైనా విరిగిపోతే రిపేర్లుచేయడం, ఇల్లాంటివన్ని బాగాచేస్తాడు, కానీ చదువుమట్టుకు సున్న. తరగతిలో మిగత పిల్లలకందరికంటే వయస్సులో గోవిందుడేపెద్ద. బళ్లో ఉపాధ్యాయులు గోవిందునకు తెలివిలేదనిన్నీ మందుడనిన్నీ, ఎప్పుడూ వేరే ఏదో ధ్యాన్యంగా వుంటాడనిన్నీ, ఏ పాఠము చెప్పినా జ్ఞాపకం వుంచుకోడనిన్నీ అంటారు. వీనితో ఏమిచేయడం అన్న సమస్య తల్లి తండ్రులకు రోజుకు రోజుకు ఎక్కువ అయిపోతూన్నది.

ఇటువంటి పరిస్థితులు మనం సాధారణంగా చాలమట్టుకు చూస్తున్నాము. మానసిక శాస్త్రజ్ఞుల కృషివలన, ఇల్లాంటి స్థితికి కారణాలు కనిపెట్టివున్నారు. కారణం తెలింది, దేనికి చికిత్సచేయడానికి వీల్లేదు కదా. ఇల్లాంటి మందబుద్ధి, మరపు, పరధ్యానము, ఇవన్నీకూడా ముఖ్యంగా మూడుకారణాలవల్ల కలుగుతుంది. ఇంటి పరిస్థితులు, బడిపరిస్థితులు, పిల్లవాని శారీరకమానసిక పరిస్థితులు.

ఇంటి పరిస్థితులు పరీక్షించిచూస్తే, బీదయింటిబిడ్డలు, కష్టజీవితముకల తల్లి తండ్రుల బిడ్డలు సాధారణంగా మందమరుపుగలవారుగానుంటారు. ఆర్థికస్థితికి, మందమరుపుకు అవినాభావ సంబంధమున్నదనికాదు. గొప్ప గొప్ప మేధావులు బీదయింటిబిడ్డలని చరిత్రవల్ల తెలుస్తోంది అయినా, పేదతనము కొన్ని విధాల పిల్లవాని చదువునకు, తెలివికి అడ్డమగుచున్నది. బీదకుటుంబములో పిల్లలకు వారి వయస్సునకు తగిన వ్యాయామ విహారములు లేనిదానివలనను శరీరమునకు ఎక్కువ పనిగలగడమువలనను, పిల్లలు, బళ్లో నున్నప్పుడు, ఉపాధ్యాయులు చెప్పునది గమనించజాలక, వేరే యేదైన తమ మనస్సుకు వచ్చింది నెమ్మదిగా యోచిస్తుంటారు. ఊహాలోకంలో తమ వ్యావహారిక జీవితంలోలేని సుఖాల ననుభవిస్తుంటారు. అటువంటప్పుడు, వారు మందమరుపు, పరధ్యానము గలవారుగా కనబడుట ఆశ్చర్యముగాదు. అన్నిటికంటే, ఇంట్లో తల్లి తండ్రులకు విజ్ఞాన చింతలేకపోవడంకూడా ఒక అడ్డంకియే. తల్లికిగానీ, తండ్రికిగానీ, ఎంత మిగత విషయాల్లో, జ్ఞానసేకరణలో, అసక్తి వుంటుందో పిల్లలుకూడా అదేలాగు అసక్తి కనబరుస్తారు.

కానీ పైనసూచించిన ఉదాహరణంలో గోవిందునికి అన్ని సుఖాలుఉన్నా, మందమరుపు పరధ్యానము వున్నదంటే, దానికి పేదరికముకాకుండా, వేరేకారణాలువుండాలి. ఇవియే బడిపరిస్థితులనిన్నీ, పిల్లవాని మానసిక, శారీరక పరిస్థితులనిన్నీ చెప్పవచ్చు.

మనపిల్లవాడికి చదువు ఎక్కలేదంటే, వాడు తరగతి పరీక్షల్లో నెగ్గకపోతే, చదువు చెప్పించడము సరీగాలేదని అంటాము. కానీ, ఒకటే తరగతిలోనున్న కొంతమంది పిల్లలు, ఆ వుపాధ్యాయుల సహాయ్యమునసే పైతరగతులకు పోవడముకూడా కలుగుట మనం మరచిపోతాము. ఉపాధ్యాయులుచెప్పు విధానంలో తప్పుకలుగదు కానీ, ఏ పిల్లలకు ఎల్లాంటి చదువు చెప్పించాలనో, తెలీకపోవటం, వారితప్పే. కొంతమంది పిల్లలు స్వతః బలశాలులుగానుండి ఎల్లప్పుడూ, ఏదో పని చేయాలనో, ఎగిరి దుమికి ఆడుకోవాలనో కోరుతుంటారు. ఈ ఆట పరావు కలవారిని రోజుకు 5 గంటల కాలము, ఒక గదిలోనే కూర్చుని శ్రద్ధగా పాఠములను గమనించుమంటే, వారికి చాలకష్టంగా నుంటుంది ఇటువంటి పిల్లలకు వారి కిష్టమైన పద్ధతుల తోనే పాఠముచెప్పితే, వారు దానిని శ్రద్ధగానేర్చుకొని బాగా జ్ఞాపకంపెట్టుకుంటారు. మరుపు అన్నది శ్రద్ధలేని దానివలననో, లేక యిష్టములేని దాని వలననో కలుగుచున్నది. ఈ శ్రద్ధ, యిష్టము కలిగించితే, మరుపు తానుగా మరిగిపోయి, పిల్లవాడు అన్నీ నేర్చుకుంటాడు. ఉదాహరణంగా, ఈ చిన్న విషయం వినండి. ఒక బళ్లో ఒక టీచరు పిల్లలకి సంగీతం నేర్పుతోంది. పాటలలోనున్న అర్థం, భావం, పిల్లలకి నేర్పాలన్న వుద్దేశంతో వాళ్లను పాటని శ్రద్ధగావిని, ఆ తరువాత, వారివారికితోచిన అర్థం చెప్పమంటుంది కానీ కొద్దిమందేవిని, గ్రహించగలిగారు. మిగతా వారికి ఇది కష్టంగా వుండటంవల్ల, వారు ఎక్కడనో ఆలోచనల్లోపడిపోయి, చెప్పేపాటను గమనించక టీచరు దగ్గర చీవాట్లు తింటారు. అదే పాటను, మరొక ఉపాధ్యాయిని నటించిచూపి, వారినీ అదే ప్రకారంగా పాడుతూ చేయమంటుంది. పిల్లలకు చలనముతో కూడిన ఈ రెండవ పద్ధతినచ్చి, అందరూ సమానంగా నేర్చుకొన్నారు. ఇందులో చెప్పదలచిందేమిటంటే, పాఠాలు నేర్పడంలోకూడా వ్యక్తిగత భేదాలననుసరించి శ్రద్ధ యిష్టము కలిగించేటట్లు నేర్పాలి. ఇల్లాంటి తర్ఫీదు లేనందుననే పైచెప్పిన ఉదాహరణంలో గోవిందుడు మందమరుపుగల వాడయ్యాడేమో!

ఇక మానసికంగాచూస్తే అశ్రద్ధలేదా పరధ్యానం పిల్లల్లో చాలమట్టుకు వారి యిష్టాయిష్టములనను, పరిసరములనను, కలుగు భేదములవలనఅని అనిపించకమానదు. ఉత్సాహముతో సంతోషముతో పొంగిపొర్లు నటువంటి పిల్లలను, అనవసరమైన కట్టు బొట్లకు లోబరచుటవలన, వారికి చదువుమీద అసహ్యంపుట్టి, వారునేర్చునది అప్పటి కప్పటికి మరచిపోయి, వారు స్వతః అనుభవించలేని ఆటపాటలను, తమ ఊహాప్రపంచంలో అనుభవిస్తూ హాయిగావుంటారు. వారిని గ్రహించలేక పెద్దవారు, మందమతులనియు పరధ్యానంగా వుంటారనియు దండిస్తారు. ఈ దండనవలన వారికి మరీపట్టుదల ఎక్కువ అవుతుంది. ఎక్కాలు మరచిపోతారు, లెక్కలు చేయడు, మరీపెద్దఎక్కమో లేక ఒకవంద లెక్కలోయిచ్చి చేయమంటే, పుస్తకము ఎదురుగాపెట్టుకొని నిదురపోవటం పిల్లలసహజం. కాబట్టి, ఇల్లాంటి అపరిమిత మైన శక్తికల పిల్లలను వారి శక్తికితగుమైన మార్గాలలోత్రిప్పి, ఉపయోగపడేట్టు చేయాలి.

కనుకనే మందమరుపు పరధ్యానము అన్నవి, అట్టి ప్రమాదకరమైన మానసికవ్యాధులక్రింద చేర్చరాదు. ఈ కారణములనుకనిపెట్టి వాటిని సరిదిద్దుటయే ఉత్తమము.

పిల్లలలోనే కాకుండా పెద్దలలోకూడా ఈ మందమరుపు పరధ్యానము కనబడుతూవుంటాయి. చిన్నపిల్లలవలెగాక, ఈ గుణాలు పెద్దవారికి చాల అనర్థదాయకాలవుతాయి. చిన్నప్పుడు పైజెప్పినట్లు

ఈ గుణాలు పట్టుబడితే, వాటిని సరియైన సమయాన సరిదిద్దకపోతే, అవి మనిషి జీవితాంతమువరకు కష్టపెడుతూ వుంటాయి. ఒక వ్యక్తికి ఆర్థికంగాగానీ మానసికంగాగానీ, చిక్కులువస్తే, చిన్నప్పుడు లేకపోయిన, మధ్యలో ఈ మందమరుపు పరధ్యానము గలుగుతాయి. ఉన్నక్లిష్టసమస్యలను ఎదుర్కొని జయించలేక వీటిని మరచిపోవాలెననే ప్రయత్నముచేయుచు అదే యోచనచేయడమువలన, ఈ పరధ్యానమే అలవాటయిపోతుంది దీనికే మానసిక శాస్త్రజ్ఞులు డిఫెన్స్ మెకానిజము అంటారు. వీటిని ఊతగా జేసుకొని తమ కష్టాలను మరచిపోతారు ఒక విషయంలో ఇల్లా అలవాటుపడితే, తరువాత ప్రతిదానికీ అల్లే వాడుకవస్తుంది.

ఆర్థికంగా వచ్చేకష్టాలు మనకు తెలిసేవున్నవి. కానీ మానసికంగా ఏ కష్టాలురాగలవు అనే తోచకమానదు. ఒక వ్యక్తికి ఒక స్వభావముంటుందనుకోండి. అస్వభావవిరుద్ధమైన పరిసరముల ప్రభావములకు ఎదురుతిరిగి తన వ్యక్తిత్వమును కేంద్రీకరించి తానే జయప్రదుడవుతాడు. లేదా పరిసరాలను లెక్కించక తన శక్తులనన్నిటిని లోనికిమరల్చి ఊహాప్రపంచంలో తనకు కావలసిన సౌఖ్యాలను ఊహించుకొనుచు సుఖపడుచుండును అటువంటివానికి తన యెదురుగా యేమిజరుగుచున్నది తెలియదు. తాను తన వస్తువులను ఎక్కడబెట్టినది తెలియదు. అంతా మరచి మనోధ్యానములో మునిగివుంటాడు.

దీనికి చికిత్స తన స్వభావమునకు పరిసరములకు ఒక సమత్వంఏర్పరుచుకొని ఆ రీతిని నడచుకొనడమే.

A. I R. అనుమతిని



# అధిక ముఖ సౌందర్యమునకు—
# పాండ్స్ రెండు క్రీములు




## ఒకటి శుభ్రపరచుటకు – ఒకటి రక్షించుటకు



మీ ముఖము మృదువుగా తాజాగా కళకళ లాడుచు నుండాలంటే రెండు శృంగార క్రీములు అవసరము మొదటది మంచి తైలములుగల పాండ్స్ కోల్డ్ క్రీమ్, చర్మమును శుభ్రపరచి మృదువుగానుంచుటకు రెండవది నూనె లేకుండా మృదువుగానుండు పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్, అదృశ్యముగానుండి రోజంతయు ఎండ దుమ్ము తగులకుండా కాపాడుటకు

మీ ముఖమును శుభ్రపరచుటకు పాండ్స్ కోల్డ్ క్రీమ్ను వాడండి—నూనె గలిగి హాయి నిచ్చు మంచులాంటి ఈ క్రీమ్ను రాత్రులందు మీ ముఖమునకు రాసి తేలికగా మర్దించండి చర్మ గ్రంధులలో అదృశ్యముగానున్న మాలిన్యపు కణములు బయటపడును. తరువాత తుడవండి ఇప్పుడు—చూడండి ఎంత పరిశుద్ధముగాను తేజోవంతముగాను మీ ముఖము అగుపడును! మీ చర్మము మనోహరమై ఎంత మృదువుగానుండును!

మీ ముఖ సౌందర్య రక్షణకు పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును వాడండి—అది నూనెలు లేనట్టిది, చల్లగా తేలికగానుండును ప్రతి ఉదయము ఈ క్రీమును పల్చగా రాయండి అది తేలికగా వ్యాపించును—ఏ మాత్రము జిగటుగానుండదు అది మీ సౌందర్యమునకు పుష్ప సదృశమైన కోమలత్వమునిచ్చును





జ్ఞప్తియుంచుకొనుడు ము ద్విష్టేయుష్ట్రే ఎండా కాలపుకొండవలన శీతాకాలపు చలి వలనను చర్మము నందలి స్వాభావిక తైలములు ఎండి పోయి చర్మము గరుకుగాను, కల్లగాను ఉండును

# పాండ్స్



ఇంకనూ జ్ఞప్తియుంచుకొనుడు — చర్మ గ్రంధులలోనికి లోతుగా పోయిన దుమ్ము, మలినపు కణములే కాలవరకు చర్మ వైగావ్యమునకు కారణము అగుచున్నవి



ప్రతి రోజు పాండ్స్ వారి రెండు క్రీములను వాడి నచో ముఖము మృదువుగాను, తేజోవంతము గాను [illegible] ఇప్పుడు [illegible] రెండు [illegible] ముఖమునకు సౌందర్యప్రద [illegible] రక్షణ [illegible]

# అంతిమ పూజ

శ్రీమతి ఎ. పేరిందేవిగారు

బుద్ధభగవానుల యనంతరం ఆయన మతం దేశంలో నలుమూలలకు ఆయన శిష్యులచే వ్యాపింపచేయబడింది. సామ్రాజ్యాధిపులు మొదలు సామాన్యప్రజలుదాకా ఆయన్ని నర్తించి కీర్తించిపూజించేవారు. ఏదో రూపంలో ఆ లోకేశుని పూజించేవారు నాటి భారతీయులు.

బింబిసారుడుగూడ తన రాజమహల్లో తథాగతుల ఆలయాన్ని నిర్మించాడు. స్వయముగా భగవానులనుయాచించి తెచ్చిన నఖాగ్రం ఆయాలయంలో స్థాపింపబడింది.

రాజవధువులు, రాజమాతలు, రాజబంధుగులు స్వయముగా ఆ ఆలయంలోకి పోయి పూజించేవారు. నిత్యబంగారు దీపాలు వెలిగేవి దానిలో. ఆవిగ్రహం దేదీప్యమానంగా ధవళకాంతులచే రాజిల్లుతూంది. ఆ 'శాంతం' 'నిర్మలత' బుద్ధభగవానుల ఆత్మే ప్రబోధిస్తోందా యన్నట్లుండేదాప్రతిమ. కాలంగడచింది. బింబిసారుని యనంతరం అజాతశత్రువు రాజపీఠాన్నలంకరించాడు. బౌద్ధధర్మం, బౌద్ధమతం, బౌద్ధసిద్ధాంతాలు, తుదకు బౌద్ధత్వమే నిషేధింపబడిందాతనిరాజ్యంలో. వేదములు, బ్రాహ్మణధర్మము బ్రాహ్మణమతాన్నిదక్క దేనిని గౌరవించినా మొండెమును శిరస్సునుండి వేరుచేయుస్తాననేవాడు అజాతశత్రువు.

అది శరత్సంధ్యాకాలము. పుణ్యానదీజలంలో స్నానంచేసి బంగారుపాత్రలో పూజాద్రవ్యాలను పట్టుకొని రాజమాతకెదురుగా నిశ్శబ్దంగా నిశ్చలంగా నిలబడింది శ్రీమతి. ఆశ్చర్యంతో నామె నవలోకించింది రాజమాత. భయంచే శరీరం కంపిస్తూంది. ధైర్యం తెచ్చుకొని గద్గదస్వనంతోఅంది 'అజాతశత్రుని యాజ్ఞవిన్నావా ? స్థూపంలో పూజాపునస్కారాలు జరిగితే; ఘోరాతి ఘోరదండన విధిస్తానన్నాడట !!'

శ్రీమతి మౌనంతో తలపంకించి యచటనుండి తొలగిపోయింది ఆవేదనాపూరిత మనస్కయై. ఆ మౌనంలో ఈ తిరుగులేని రాజాజ్ఞనుతిరస్కరించే సాహసం, క్షత సహానంలేనిమూఢులపై ఆగ్రహం-కాదు-వారి అజ్ఞానంపై జాలి మూర్తీభవించియున్నాయ్.

రాజమహిషి అమిత అద్దంవద్దకూర్చొని కురులసింగారించుకొంటూంది. పాపిటలో సిందూరం నింపుకొంటూ అమిత అద్దంలో పూజావేషంతో మూర్తీభవించిన పవిత్ర బౌద్ధత్వానిజూచి సిందూరం జారవిడచి భయభ్రాంతయై వెనుదిరిగి జూచింది పూజాద్రవ్యాలతోయున్న శ్రీమతిని. నెమ్మదిగా 'పిచ్చిదానా ! నీకేశిక్షవిధిస్తారో తెలుసా ? త్వరగాయిటనుండిపో, ప్రాణసంరక్షణార్థం ! ఎవరైనాచూస్తే నీ కుసుమకోమలజీవితాన్నే

త్రుంచివేస్తారు!' అంది కంపితస్వరంతో, రుద్ధకంఠంతో. శ్రీమతి మౌనంగా యిచ్చట నుండికూడ నిష్క్రమించింది.

అస్తమయసూర్యుని అంతిమకిరణాలు భూమిమీద బంగరునాగళ్ళవలె ప్రసరిస్తున్నాయ్. ఆ వెలుతురులో రాజకుమారి శుక్లకావ్యపఠన సాగిస్తోంది. అందెలమ్రోత వినగానే ఉలికిపడి వెనుకదిరిగిచూచింది పూజావేషంతోయున్న శ్రీమతిని. పుస్తకాన్ని మడచి దగ్గరగాపోయి, అప్యాయంతో మెల్లగా 'ఇల్లాగయితే మృత్యువు నాహ్వానించుకోవటం శ్రీమతీ!' అన్నది. మారుపలుకక పూజాపాత్రగైకొని పురిలో నింటింటికి బోయి-'ఓ నగరవాసులారా! నారీమణులారా! ప్రభువు బుద్ధభగవానుల పూజాసమయమయినది. త్వరపడుడు దైవపూజానిర్వహణకై' అంటోంది ఎలుగెత్తి. ఆ కేకలు వింటూంటే, కొందరకు భయం, కొందరకు ఆశ్చర్యం, సంకోచం, మరికొందరి కీఅర్థరహిత అసమాననిషేధంపై అసహ్యం, హేయభావం, కొద్దిమందికిమాత్రం పైకుబుకని సాహసం, ఆవేశం ఉద్భవించాయి. కాని ఎవరు సాహసిస్తారు ప్రాణాలనెరవెట్టి రాజాజ్ఞనుల్లంఘించటానికి? నిరంకుశ శాసనంకదా రాజశాసనం!

క్రమంగా రవి పశ్చిమాద్రిలో క్రుంగిపోయాడు. పట్టణకోలాహలాలు, పక్షుల కిలకిలారావాలు సన్నగిల్లాయి. శాంతం నిశ్శబ్దం పట్టణాన్నంతనూ ఆక్రమించాయ్. రాజమందిరంలో సంజహారతులు వెలిగించారు. శరద్రాత్రిలో అంబరపథంలో చుక్కలు మిలమిలా మెరసిపోతున్నాయ్. కోటలో తూర్యనాదాలు ప్రారంభమయ్యాయి వందిమాగధుల స్తోత్రపాఠాలతో పహారావాడు భయసంభ్రమాశ్చర్యాలు ముప్పిరిగొనగా జూస్తూన్నాడు బుద్ధభగవానుల స్థూపంవద్ద వెలగే బంగారుదీపకాంతులకేసి. 'పరమేశునకైనా ధిక్కరింపనశక్యమైన రాజాజ్ఞను ధిక్కరించే ఈ అతిలోకసుందరి ఎవతె? ఈ సుకుమారి కోమలశరీరంపై ఈకరాసి నేవిధంగా ప్రయోగించగలను?....ఛీ! రాజాజ్ఞను ధిక్కరించరాదు - దైవాజ్ఞధిక్కరించినట్లే.........రాజాజ్ఞను నెరవేర్చి బుద్ధభగవానుని విగ్రహంపై ప్రథమబలి నిచ్చినందుకు ప్రభువుచే బహూకరింపబడాలి'! అంటూ ఒరనుండి పెరికిన తళతళమెఱసే కరాసిచే నరకవచ్చాడు పహారావాడు. 'నేను శ్రీమతిని...బుద్ధభగవానులదాసిని...ఆయన పాదాలచెంతనే' అంది శ్రీమతి గభీరంగా........

*  *  *  *

ధవళకాంతులు వెదజల్లేస్థూపంమీద రక్తధారలు ప్రవహిస్తూ వింతకాంతులను వెదజల్లాయ్. పహారావాడు విజయగర్వంతో మీసం మెలేస్తూ రాజసందర్శనానికై చనుదెంచాడు. ఆస్వచ్ఛంద శరద్రాత్రులలోనే ఆ స్థూపంలో బుద్ధభగవానుల అంతిమపూజ నిర్వర్తింపబడింది వీరభారతనారీమణి, బుద్ధభగవానులదాసిచే—

(రవీంద్రుని అనుకృతి)




(బావ—మఱఁదలు)

కవిచంద్రులు కోటసోదరకవులు, అష్టావధానులు

మఱఁదలు

పండుగకువచ్చినార ! ఓ బావగారు,
అక్కగా రదియేమి మీ ప్రక్క లేరు,
ఒంటరిగవచ్చినార మా యింటికిపుడు ?
అన్న వ్రాసిన ఉత్తరమంద లేద !

ఆలసింపక యర్ఘ్యపాద్యాదులంది
సేదఁదీర్చుకొనండి యీచెట్టునీడ ,
పయనమొనరించుటను చాలబడలినారు ;
నడచివచ్చితిరేమొ ! ఇక్కడకుమీరు.

రైలుచార్జీలకై ప్రాలుమాలినార !
కఱవుకాలము పండుగకర్చులెక్క
వగునటంచు యోజించిరా ! బావగారు.
అక్కవచ్చుచో భారమౌనె ? మాకు !

అక్కతోడుగరామి మర్యాదమీకు
సన్నగిల్లును క్రమముగా స్నానపాన
భోజనమ్ముల మంచితాంబూలములను.

... ... ....

అక్కబావయు వచ్చెదరంచు వేఁగ
గుమ్మమూడిచి, చల్లి, క్రొంగ్రొత్తరంగ
వల్లికలఁదీర్చి, యెదురుగావచ్చినిలువ
నిలువునీరైతి, నొక్కని నిన్నుఁజూచి!

బావ

రైలుచార్జీలకై ప్రాలుమాలికాదు ;
స్వయముగా బిల్వలేదని శంక కాదు ;
పండుగెల్లను నేన సాపడఁగ కాదు ;
మఱఁదలిని చిన్నబుచ్చుటేమాత్ర కాదు.

నెలలుసరిపడకునికి రానేరకుండె
ఎక్కసక్కెమ్ములేల ! మీ అక్కగారి
కొడుకు, కూతురనో ఎత్తుకొందుగాని !
అంతియేగాని వేఱు కాసింత లేదు.

మాకులోపంబె నినుబోలుమఱఁదలుండ
జరుగవలసిన మరియాద జరుగఁగలదు.

* * *

ఏది యెట్లైన అత్తగారింటికేగు
నప్పుడల్లురు తమ వెంట తప్పకుండ
భార్యలను వెంటఁగొనిపోవ భావ్యమగును ;
వరుస దీపావళీవంటి పండుగులకు.



# ఆశీస్సులు

శ్రీ కారుణ్యపయోనిధీశుఁడును లక్ష్మీజీవితేశుండునున్
లోకారాధ్యుఁడు దేవదేవుఁడును దూర్పున్ జేనితమ్ముండు, ర
క్షోకందర్పవినాశ గౌరివిభుఁడుం ఘోణ్యావతారుండు, సు
శ్రీకంజేయుచుఁబ్రోచుఁగాత! గృహలక్ష్మీ! నిన్ను నశ్రాంతమున్.

కేసరి నామాఖ్యుఁడు ధీ
కేసరి, నినుఁబెంచుచుండ, గృహలక్ష్మీ! జనుల్
నీసరివారును లేరన
భాసిలుచుం బుడమియందు వర్ధిలుమమ్మా!

బులుసు పురుషోత్తం.

# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. ఎన్. కేసరి.

## కేరళ దేశాచారములు

### శంకరుని శాపము.

కొన్ని సంవత్సరములకుముందు నేను తిరుచూరు మకాములో ఉండగ మాఇంటి మదురుగోడ ప్రక్కన పెద్దమంటలు మండుట చూచితిని. ఆ మంటయేమని మా యింటి లోని వారి నడిగితిని. కేరళరాజ్యమున మృతిజెందిన వారి కళేబరములను ఇంటివారి-దొడ్డితోటలలోనే దహనముచేయు ఆచారము కేరళదేశమునగలదని వారుచెప్పిరి. రాత్రి మన ప్రక్కఇంటిలో నౌకరు చనిపోయినందున వారి నక్కడ కాల్చుచున్నారని చెప్పిరి. ఆ మాట వినినతోడనే నాకు చాలఆశ్చర్యముగలిగి నేనామదురుగోడవద్దకు పోయి కాలుచున్న కళేబరమును చూడగలిగితిని.

ఈ రాజ్యమున ఈ విధముగ శవదహనమును చేయుటకు కారణమేమని వారిని నేను ప్రశ్నించితిని. అప్పుడు వారు నా ప్రశ్నకు ఈ క్రింద వ్రాసిన శంకరుని చరిత్రను విపులముగ చెప్పగలిగిరి.

ఈ రాజ్యమునయందు ప్రతి పాఠశాలలోను ప్రసిద్ధ పురుషుడగు శంకరాచార్యుల జీవచరిత్రను బాలబాలికలకు బోధించెదరు. గనుక వారిని గురించిన విషయము లన్నియును వీరికి దెలియును.

ఈ తిరుచూరుకు సమీపముననే కాలడి అను పల్లెటూరుగలదు. ఈ గ్రామమున శివగురు అనునొక ప్రసిద్ధ నంబూదిరీబ్రాహ్మణోత్తము డుండెను. వీరికి ఆర్యయను నొక సతీ తిలకముండెను. ఈ శివగురు సకల శాస్త్రసంపన్నుడై ధర్మపత్నితోగూడి యజ్ఞ యాగాది క్రతువులనొనర్చి కేరళరాజ్యమున ప్రసిద్ధిచెంది యుండెను. ఈ బ్రాహ్మణునకు వయసు చెల్లుచుండినను సంతాన సంపదలేకయుండెను. అప్పుడా శివగురు ధర్మపత్నితో సహా వృషగిరిఅను శివక్షేత్రమునకువెళ్లి అక్కడ శివభజనను చేయుటకు ప్రారంభించెను. అప్పుడు శివుడు వారి భక్తికి మెచ్చుకొని పుత్రసంతానము గలుగునటుల వారికి వరమిచ్చి అనుగ్రహించెను. పిమ్మట కొంతకాలమునకు ఆర్యగర్భవతి అయి పుత్రునిగనెను. ఈ పుత్రునిచూచి శివగురునకు మితిలేని ఆనందము గలిగెను. ఈ బిడ్డడే విశ్వవిశ్రుతుడైన ఆదిశంకరాచార్యస్వామి. వీరు క్రీస్తుశకము 806 సం॥మునకు సరియగు కలివర్షం 3927 చైత్రమాసము (మేడమాసం 18 తేది) 18 తేదిన కాలడి గ్రామమున స్వగృహమునందు జనన మందిరని కేరళమున పండితులు నిర్ణయించిరి. వీరి జననకాలము అనేకులు భేదాభిప్రాయమును దెలిపినను కేరళపండితులు నిర్ణయించిన జననదివసమే సరి అని దేలుచున్నది.

శంకరుని జననము—మరి యొక కధ-శ్రీ శంకరాచార్యుల జననమును గురించి మరియొక కథనుకూడ ఇక్కడ చెప్పెదరు. శంకరునితల్లి వైధవ్యమును పొందినపిమ్మట శంకరుడు జన్మించినట్లు చెప్పెదరు. తల్లి సంతానములేక పరితపించుచు ఈశ్వరుని ధ్యానించుచుండెనట. ఈశ్వరుడు కరుణించి తల్లి స్వప్నమున చనిపోయిన భర్తసంయోగమును అనుగ్రహించినట్లును, అప్పుడామె గర్భవతిఅయి శంకరుని కనినట్లును కధకూడ గలదు. అయినను భర్తలేకుండ ఆమె బిడ్డను కనినందులకు స్వజాతివారు ఆమెను కులభ్రష్టురాలునిగచేసి వెలివేసినట్లుకూడ కేరళదేశ చరిత్రయందుగలదు. ఈ కులభ్రష్టురాలికి పుట్టిన పుత్రుడే జగద్గురువు శ్రీ శంకరాచార్య స్వాములువారు. ఇట్టి మహాత్ములు మరెందరున్నారో ?

శంకరునకు మూడవ సం॥ము వయసు దాటక మునుపే తండ్రి పరమపదించెను. అప్పటినుండి బాలుడు తల్లి చాటుననే పెరిగెను. వీరి కుటుంబము చాల పేదదైనందున ఊరివారి సహాయముతో శంకరునకు ఉపనయనాది వైదికకర్మలను తల్లి చేయవలసి వచ్చెను. ఈ దేశపు నంబూదిరీబ్రాహ్మణుల కులాచారముల ననుసరించి బాలునకు వేదాధ్యయనాది విద్యలను అక్కడి పండితులవద్దనే అభ్యసింపచేసెను. వీరు చిన్నతనముననే సర్వశాస్త్రముల నభ్యసించి గొప్పపండితులైరి.

శంకరునకు జ్ఞానప్రాప్తి సిద్ధించిన వెంటనే సన్యసించవలయుననే కోరిక మనసున దృఢముగ నాటుకొనెను. అయితే తాను సన్యసించిన వంశక్షీణమగునని తల్లి తలంచి సన్యసించుటకు ఆమె అనుమతి నివ్వదేమోనని సంశయించుచు యోచించుచుండెను.

ఇట్లుండగ ఒకనాడు శంకరుడు ఇంటి సమీపముననే యుండిన నదీప్రవాహమున స్నానముచేయుటకు వెళ్లెను. స్నానముచేయుచున్న శంకరుని కాలును నదిలోయుండిన మొసలి గట్టిగ పట్టుకొని బాధించుచుండెను. అప్పుడు బాలుడు బాధకు తాళలేక "అమ్మా-అమ్మా" అని ఆర్తనాదమున తల్లిని పిలిచెను. వీరి ఇల్లు ఆ నదీ సమీపముననే ఉండినందున కుమారుని కేకలు తల్లివిని మరి కొందరినికూడ పిలుచుకొనివచ్చి కుమారునిఅవస్థను చూచెను. వచ్చిన వారందరుకూడ బాలుని కాలును మొసలి విడిపించుటకు సర్వప్రయత్నములను చేసిరిగాని అది విడువలేదు.

అప్పుడు శంకరుడు తల్లినిచూచి "అమ్మా మొసలివాతపడి చనిపోవుచున్న నాకు సన్యాసమును స్వీకరించుటకు నీవు అనుమతినిమ్మ" అని దీనముగ తల్లిని ప్రార్థించెను. అప్పుడు కుమారుని కష్టములనుచూచి సహింపలేక వెంటనే సన్యసించుటకు తల్లి అనుజ్ఞనిచ్చెను. తల్లి అనుమతి ఇచ్చిన వెంటనే కుమారునికాలు మొసలి విడిచి పారిపోయెను !

తాను సన్యసించుటకు తల్లి అనుమతిని తీసుకొనిన కొద్దికాలమునకే శంకరుడు తనకు సన్న్యాసమును ప్రసాదించుటకు తగుమైన గురువరేణ్యుడు యెక్కడున్నాడోయని వెతుకుటకు దేశయాత్రకు పయనమై తల్లి అనుమతిని గోరెను. అప్పుడు తల్లి కుమారుని చూచి నాయనా నీవు నాకు యేకపుత్రుడవే. నా శేషక్రియలు నీ చేతిమీదుగచేయక నిన్ను దేశయాత్ర చేయుటకు నేనెట్లు సమ్మతించగలనని కంటనీరు కార్చెను. అప్పుడు శంకరుడు అమ్మనుజూచి నేను సన్న్యాసమును స్వీకరించి యేదేశమందుండినను నీ అంత్య కాలమున నీ ప్రక్కనయుండి అనంతరము అంత్యక్రియలను యథావిధిగ జరిపెదనని తల్లితో ప్రమాణమునుచేసి నప్పించి ప్రయాణమై దేశయాత్రకు వెళ్లెను.

పిమ్మట శంకరుడు గురువును వెతుకుచు దేశములు దిరుగుచు కడపట నర్మదా నదీతీరమున నివసించుచుండిన గోవిందాచార్యుల వారిని కనుగొనెను. అప్పుడు వారిని దర్శించి ఆశ్రయించెను. శంకరుడు గోవిందాచార్యులను చూచినవెంటనే వీరే నాకు సన్న్యాసమును ప్రసాదింపదగిన పుణ్యపురుషులని తలంచి తన కథ నంతయు వారికి చెప్పెను. అప్పుడా గోవిందాచార్యులు ఈ నూతన శిష్యుని ముఖతేజస్సును జ్ఞానజ్యోతినిచూచి అపరమితానందమునుచెంది బాలునిచేరదీసి జ్ఞానోపదేశమును చేసినపిమ్మట సన్న్యాసమును ప్రసాదించి అనుగ్రహించి ఆశీర్వదించెను.

శంకరుడు ఆ గురువరేణ్యునివద్ద జ్ఞానమార్గము సిద్ధించువరకు ఉండెను. పిమ్మట కాశీకి చేరెను.

ఆచార్యులు వారణాశిచేరినప్పుడు ఉత్తరభారతదేశమున హిందూమతము చాల క్షీణావస్థయందుండెను. అక్కడ బుద్ధభిక్షుకుల ప్రచారములవలన యాగాదిక్రతువులు అంత మొందుచుండెను. అట్టితరుణమున ఆచార్యులవారు జ్ఞానకాండను ప్రచారమును సలుపుచు హిందూమతస్థాపనకు బద్ధకంకణమునుకట్టుకొనిరి. కాశీయందుండు గొప్ప పండితోత్తములలో వాదప్రతివాదములను సలిపి వారినిమెప్పించి దేశమున సుప్రసిద్ధుడాయెను ఈశంకరుడు. వీరుకాశీక్షేత్రమునందుండి బ్రహ్మసూత్రం, దశోపనిషత్తు, భగవద్గీత ఈమూడుగ్రంథములకు భాష్యంవ్రాసిరి. ఈప్రస్థానత్రయి అనుమూడు గ్రంథములకు భాష్యంవ్రాసినవారినే ఆకాలమున మతస్థాపకులుగ పరిగణింపుచుండిరి.

ఈ శంకరభాష్యములే వీరి అఖండజ్ఞానశక్తికి నిదర్శనములు.

శంకరుడు కాశీనుండి ప్రయాగకు వెళ్లిరి. అక్కడ బౌద్ధమత విధ్వంసకుడగు కుమారిలభట్టును దర్శించెను. హిందూదేశమునందుండిన పండితోత్తముల నందరిని దర్శించి వార్లతో శాస్త్రచర్చలు జరిపి ఓడించవలయుననేదే వీరి ఆశయము. కుమారిల భట్టు శిష్యుడగు మండనమిశ్రుని, వీరిభార్య, సరస్వతీదేవితో సమానురాలైన భారతీ





మదనపల్లె మహిళాసమాజపు 5-వ వార్షికోత్సవ సందర్భమున ఛాయాచిత్రము.
అధ్యక్షతవహించిన K. రామసుబ్బమ్మగారు మధ్యనున్నారు. వారిప్రక్కన
సమాజ అధ్యక్షురాలు K. సుందరాబాయిగారు.





కాలడిలో శ్రీ ఆది శంకరాచార్యులు ప్రతిష్ఠించిన శారదాదేవి విగ్రహం





కాలడిలో శ్రీ ఆది శంకరాచార్యులవారి విగ్రహం

దేవిని దర్శించిరి. వీరిరువురను ఓడించి దిగ్విజయమునుపొందిరి. పరాజయమును పొందిన మండనమిశ్రుడు స్వాములవారి శిష్యబృందమునచేరి సన్యాసమును స్వీకరించిరి. పద్మపాదుడు, మండనమిశ్రుడు మొదలగు శిష్యులను వెంటబెట్టుకొని దేశసంచారమునుసల్పి పండితులనందరిని మెప్పించి దిగ్విజయమును బొందినతర్వాత స్వామి శృంగేరిచేరిరి. ఆచార్యులు శృంగగిరి చేరినప్పుడే తల్లి ఆర్యాదేవి చరమశయ్యపై పరుండి తన్ను స్మరించుచున్నట్లు జ్ఞానదృష్టితో గ్రహించినవాడై స్వగ్రామమగు కాలడికి మరలివచ్చి తల్లిని దర్శించెను. కుమారునిచూచి తల్లిసంతసించి మరణించెను. అప్పుడు కుమారుడు తల్లిని స్మశానమునకు తీసుకొనిపోయి కర్మక్రియలను జరుపవలసివచ్చి స్వజాతి నంబూదిరి బ్రాహ్మణులను పిలిచి తనకు సహాయపడవలయునని వారినికోరిరి గాని వారెవరును వీరికి సహాయపడక నిరాకరించిరి. ఏలననగా శంకరుడు సన్యాసిఅగుటవలన వీరికి మాతాపితృకర్మలను ఆచరించు అధికారములేదు. మరియు వీరు బ్రహ్మచారిగనుండి సన్యసించినది శాస్త్రవిరుద్ధమని కక్షకట్టి శంకరుని వెలివేసి సహాయ నిరాకరణమును సాగించిరి.

ఈసమయమున తల్లిశవమును ముందుబెట్టుకొని యెంతకాలముండగలరు? తల్లి చాల స్థూలశరీరమును గలిగినది. ఇంటతోడు మరియెవరులేరు తానొక్కరు శవమును కాటికిమోసుకొని పోవునంతశక్తిలేదు. అప్పుడు శంకరునకు ఒక ఆలోచనతట్టి వెంటనే ఇంటిలోకిపోయి మూలనున్న గండ్రగొడ్డలిని సుకవచ్చి శవముయొక్క ప్రతిఅవయవమును తుండ్లుగనరికెను. నరికినతుండ్లను ఒక్కొక్కటిగ తానుతీసుకొనిపోయి ఇంటిదొడ్డి తోటలోవుంచెను. అదివర్షాకాలము జోరున వర్షముకురియుచుండెను. కాల్చుటకు కట్టెలులేవు. అప్పుడు శంకరుడు తోటలోనున్న అరటిమాకులను నరికి కాష్టమునుపేర్చి అందుపైన నరికిన తల్లిముక్కలనుపేర్చి అగ్నినుంచెను. వర్షము కురియుచున్నందునను మాకులు పచ్చివైనందునను అగ్నిచల్లారుచుండెను. అప్పుడు శంకరుడు అగ్నిదేవుని ఆరాధించి ప్రార్థించెను. అప్పుడు అగ్నిభగ్గునమండి తల్లిదహనమాయెను. ఈచిత్రమునంతయు చూచుచు వారియింటియెదుట నిలుచున్న స్వజాతి బ్రాహ్మణులందరు ఆశ్చర్యపడి శంకరుని తపోబలమునకు మెచ్చుకొని వారందరు అప్పుడు శంకరుని శిష్యులయిరి.

కేరళదేశమున చనిపోయినవారిని తమయిండ్లతోటలలో దహనముచేయుట ఇక్కడివారికి అమంగళముగాని భయముగానిలేదు. దహనముచేసినస్థలమును పవిత్రముగనుంచి ఒకసంవత్సరమువరకు అక్కడ దీపారాధననుచేయుచు మ్రొక్కుచుండెదరు. ఆస్థలమున ఫలవృక్షమునుగూడ నాటిపెంచెదరు. మన తెలుగుదేశమునను చెట్టునాటవలయునని యున్నదికాని సామాన్యముగ శ్రద్ధలేక, అర్థము తెలియక జమ్మికొమ్మతెచ్చి గ్రుచ్చుదురు. ఆటోపికయు లేనివారు ప్రత్యామ్నాయముగ నొక దర్భపోచను నిలువబెట్టుదురు. అది

అప్పుడే గాలికికొట్టుకొనిపోవును, మృతిచెందినవారిస్మృతి చిహ్నముగా పచ్చనిచెట్టునాటి పెంచుట - ఉత్తమోత్తమధర్మము. హిందూధర్మ మందిమిడియున్నది. ఇక్కడచచ్చిన వారిని పెద్దఅరటిఆకులో పరుండబెట్టి పిమ్మట దానిని ముక్కలుగనరికి అగ్నియం దుంచెదరు. అరటికాయనుకూడ ముక్కలుగనరికి కాష్టమందుంచు ఆచారమిప్పటికిని అములునందున్నది. ఇట్లుచేయుట శంకరుడుతల్లిని తుండ్లుగనరికి అగ్నియందుంచిన విషయమును దెలుపుచున్నది.

తల్లికర్మకాండనంతయు ముగించుకొని రెండవసారి దేశయాత్రకు శిష్యులతో కూడ పయనమాయెను. ఈయాత్రలో మొదట కాశ్మీరమునకు వెళ్లిరి. అక్కడుండు పండితులనందరిని జయించి అక్కడ స్వామి సర్వజ్ఞపీఠారోహణపదవిని పొందిరి.

ఆచార్యులు మొదట శృంగేరికిపోయినప్పుడే అక్కడ మఠమును స్థాపించి తన శిష్యవర్గములో నొకరగు సురేశ్వరాచార్యులవారిని ఆమఠాధిపతిగ నుంచిరి.

పిమ్మట జగన్నాధం, ద్వారక, బదరికాశ్రమం ఈస్థళములలో ఆచార్యులు మఠములను స్థాపించి ఆమఠములకు త్రోటకాచార్యులను, హస్తామలకుని, పద్మపాదను ఈముగ్గురును పైమూడుమఠముల అధికారులుగ నియమించిరి. హిందూమతస్థాపనానంత రము స్వాములవారు స్వదేశమునకు మరలిరి. స్వస్థానమగు కాలడిగ్రామమునకు సమీప మునయున్న తిరుచూరుకు చేరిరి. అక్కడ బ్రహ్మపాదములచేరిరని ప్రమాణము. వీరి నిర్వాణమునకు పూర్వమే తిరుచూరులో నాలుగుమఠములను స్థాపించిరి. వాటిలో బ్రహ్మస్వమఠమునందు ఇప్పుడుకూడ విద్యార్థులకు సంస్కృతమున్నుగఱపి భోజనమును పెట్టుచున్నారు. పరస్థానీకులెవరైనను వచ్చినను ఈమఠమునందు భోజనవసతిగలదు. ఆచార్యులవారు బ్రహ్మస్వమఠమునందే 32 వ సం॥ మున స్వర్గస్థులయిరి. వీరిశవమును తిరుచూరులోయున్న వడకున్నాథ శివక్షేత్రమున దహనముచేసినట్లు ఆదేవాలయములో ఒక ఆనవాలుగలదు. ఈదేశమున సన్యశించినవారిని శివుని దేవాలయములలో దహనము చేయు ఆచారముగలదు.

శ్రీ ఆదిశంకరులవారు కాశ్మీరదేశమునకు పోయినప్పుడు హిందూమత స్థాపనా నంతరము శ్రీనగరమునకు 85 మైళ్లదూరముననుండు 6000 అడుగుల యెత్తుగలపర్వతమున తపస్సును చేయుచుండిరి. ఈగిరిపేరు శంకరాచార్యుల గిరి అనెదరు. ఈపర్వతాగ్రమున శంకరులవారు శివాలయమును స్థాపించిరి. ఈదేవునిపేరు అమరనాథుడు. ఇక్కడ శంకరుల వారు తపస్సుచేసిన గుహాకలదు. వీటిని ప్రతి సం॥ మును దర్శించి పూజించుటకు లక్షలాదిజనులు అక్కడికి యిప్పటికిని పోవుచున్నట్లు 1948 సం॥ ఆగస్టు 22 వ తేది మద్రాసు హిందూపత్రికలో వ్రాసియున్నారు. యాత్రికులు ఈపర్వతారోహణకు కాశ్మీరపు

సర్కారువారు కావలసిన సౌకర్యములను వసతులను యేర్పాటుచేయుచున్నారు. శంకరుల వారి కాశ్మీరయాత్రకు ఇదిగొప్ప నిదర్శనము.

ఈసందర్భములోను మద్రాసులోని శవదహనకష్టములనుగూర్చి నాఅనుభవమును కూడ వ్రాయుచున్నాను.

మద్రాసులో పీనుగలనుమోయు వృత్తి నవలంబించిన వాహకుల జట్టుగలదు. అందరికివలెనే వారికిని ఒకసమితిగలదు. ఈసమాజము వారందరు యెందుకు పనికిరాక కడపట పీనుగులమోయు వృత్తిలో చేరినవారు. వీరు మద్రాసులో అక్కడక్కడ నిర్ణయస్థళములలో నిలుచుకొని పిలుపులకు నిరీక్షించుచుందురు. కర్మకాండను జరిపించు పౌరోహితుడుపోయి ఒక జట్టును చచ్చినవారింటికి పిలుచుకొనివచ్చును. ఈపౌరోహితునకు వీరందరు పరిచయస్తులే. వచ్చినవాహకులు చచ్చినవారినిచూచి బేరముపెట్టెదరు. ధనవంతుడై లావుగనుండిన వాహకుల పంటపండినదే. ఒకజట్టువచ్చినచోటికి మరియొక జట్టు రాకూడదను కట్టుబాటు వీరికిగలదు. ఈవాహకులు అడిగినంతడబ్బు యివ్వలేక పోయినను వారిని పిలుచుకవచ్చిన పౌరోహితుడు తీర్మానించినప్రకారము వారు సమ్మతించి శవమును లేవదీసుకొని పోయెదరు. ఈపౌరోహితునిదయ వీరికి కావలసియుండును. వీరికిందులో కమీషన్ కూడనున్నది. గనుక కేరళదేశాచారము చాలసులభువుగనున్నది.

ఈదేశమునయున్నమిగత అన్నిపద్ధతులకంటె శవమును దహనముచేయుటయే మంచిపద్ధతియని ఇప్పుడు పాశ్చాత్యులు, నాజూకైనపద్ధతి నొకదానిని కనిపెట్టిరి. ఒక పెట్టెలో శవమునుంచి తలుపునుమూసి ఎలక్ట్రిక్ స్విచ్చిని (Electric Switch) వేసిన అరనిమిషములో శవము భస్మమైపోవునట. ఈపద్ధతి మనదేశములో అములునందుంచిన ప్రజల కష్టములు పోగలవు.

## కాలడి క్షేత్రము

కాలడిక్షేత్రము చిన్నగ్రామమైనను రమణీయమగు వృక్షరాజములమధ్య పెరియారను పేరుగల నదీతీరమున వెలసిఉన్నది. అక్కడ శంకర శారదా దేవులను ప్రతిష్ఠించిన చిన్న దేవాలయములుగలవు. శంకరాచార్యుల తల్లిని దహనముచేసిన స్థళమున తులసికోటగలదు. సంస్కృత విద్యార్థులకు పాఠశాలగలదు. యాత్రికులకు ధర్మశాల గలదు. ఈక్షేత్రమునకు పోవలసినవారు మద్రాసునుండి కొచ్చిన్ ఎక్స్ప్రెస్సులోయెక్కి అంగమాలిఅను రైలుస్టేషన్ లోదిగి కాలడికి పోవలయును. లేదా తిరుచూరునుండి బస్సులో యెక్కిన కాలడిలో దిగవచ్చును. ఈ కాలడి క్షేత్రము తిరువనంతపుర సంస్థానమునకు చేరినది. వేసవికాలమున కాలడి గ్రామము చల్లగనుండును. నదీ స్నానము అన్ని రోగములను కుదుర్చునని ప్రతీతిగలదు. నేను తిరుచూరు మకాములో యున్నప్పుడు అప్పుడప్పుడు కాలడికి పోవుచుందును.

---

# చందమామ

సంజచెలి లేనగవుతోడి చలువచూపు,
కలువకన్నుల క్రొంగ్రొత్తవలపురేఖ,
కుహూవుకుహూవను కోకిల కూజితమ్ము,
స్వాగతమునిచ్చు నీకదే చందమామ!

భానుడస్తాద్రి మాటున పద్మిని నొడి
జేరనపరదిక్కాంత శృంగారమూని
కులుకుచున్నది నీరాక దలచియాత్మ,
జాల మొనరింప బోకోయి చందమామ!

అనుగు సైదోడనంగ భయంబదేల ?
కంతుతో గూడి స్త్రీల నిక్కట్లువెట్టు
నీచిలిపిచేష్టలను గాంచి నిందజేసి
మందలించు నటంచు నా చందమామ!

హేమగిరి నుండి మెలమెల్ల మొందు కటుల
తొంగిజూచెదవింకను తొగలవైరి
యున్నవాడనియేన ? నీయూహ ? నమ్మ
జాలవా నాదుమాట నో చందమామ!

కలువ వికసించె, కమలంబు కళలువాసె,
అబ్ధి గర్వంబు మిన్నంటె; నళులురేగె,
కైరవిణి క్షీరవారాశి కరగిమెప్పె!
చంద్రశిల నిల్వనీరయ్యె చందమామ!

దిక్కుదిక్కుల వారెల్ల తెలివిగనిరి,
సురతతి, చకోరము తృప్తి చొక్కిమనియె!
జారచోరులు భయమంది చాటుగనిరి;
చతుర! నీదర్శనముచేత చందమామ!

ప్రణయమునుబెంచు లేమావిపల్లవములు;
గాంచవచ్చును కోకిల కమ్రగీతి
రీతియందున, విరహిణీభీతహృదయ
మందు నీపూర్ణబింబమ్ము చందమామ!

ఎల్లరకుమామ వేరికి పిల్లనీవు?
తల్లిపిల్లలనొకరీతి దలతువైన
వావివరుసలు మరచి భావముననీకు
స్వాగతంబిత్తు నెల్లరున్ చందమామ!

గుండాబత్తుల లక్ష్మీబాయ్.




## — శిశువ్యాధులు - వానిలక్షణములు —

(గతసంచిక తరువాయి)

16 నులిపురుగులు.- పిల్లలకు జీర్ణశక్తి నశించినప్పుడు, మలబద్ధకము కలిగినప్పుడు, పిండివంటలు తినుటకు మితిమీరియిచ్చినప్పుడు మలములో కలిసిపడుచుండును. అవి రెండుమూడు విధములుగనుండును. అవియున్నవని అనుభవవైద్యులు పిల్లల ముఖవర్చస్సు తగ్గియున్నపుడు గ్రహించెదరు. పిల్లలు శుష్కించెదరు. ఇవి పేగుల నంటియున్నందున వాంతులుకలుగును. కొన్నివేళల నోటినుండికూడ పడును.

17 కర్పాణి :- బిడ్డలకు, సామాన్యముగా నడుచుటకు ప్రారంభమయి తప్పటడుగులు వేయుచున్నప్పుడు మోకాళ్లకు క్రిందిభాగమున పిక్కలయందు కానుపించును. మెరుపురంగుకలిగి పళ్లికలవలెవుండును. వ్యాపించుటకు పళ్లికలచుట్టు తెల్లని పూసలవలె గుల్లలులేచును. అవి చితికి నీరుకారును. త్వరగా వ్యాపించునేకాని మానవు. దురదమెండు. ఇట్టివి సులభోపాయముగ నివారించుటకు, పిల్లలు మూత్రము పోయునప్పుడు కాళ్లమీద, పడకుండునట్లు చూడవలయును.

18 గవదబిళ్లలు - చెవుల క్రిందిభాగమున యిరువైపులకాన్పించును. వత్తిన నొప్పి కలుగును. మెరుపుగనుండును. బాదముకాయలంతకూడవుండును. మెరుపుగనండి మెరయుచుండును. జ్వరముకూడవచ్చును. జ్వరమునకు చికిత్సచేయరాదు. చెవిపోటుకూడకలుగును. దీనిని అంటువ్యాధియనికూడ చెప్పుదురు. ఇట్టిపట్ల గాలిని తెలుసుకొని జాగ్రత్తపడుటమేలు.

19 స్వరపేటికవాపులు :- దగ్గు స్వల్పముగనుండును. గొంతునకు యిరుప్రక్కల వాయును. పాలుగాని ఆహారముగాని సులభముగ మింగుటకు వీలుకలుగదు. డాక్టర్లు ఆపరేషన్ చేయవలయునని సులభముగ చెప్పుదురు. కొండనాలుకకు

యిరువైపుల దింగ్లుమాదిరిగ యెరుపుగ కానుపించును. అట్టిభాగములను ఆపరేషన్ చేయుట కూడనిపని. అవితొలిగిన మాటలస్వరము తప్పును. కుంటు పడినమాటలు వచ్చును. వీటినే ఇంగ్లీషులో టాన్సిల్స్ అని అందురు. మామూలుగ లివరువ్యాధివలెనే ఇదియు పరిపాటయినది.

20 కామెర్లు - పలువిధములుగ నుండును. ఆరోగ్యముగానుండు పిల్లలకు సహితము ఉన్నటులుండి కానుపించును. ముఖ్యముగా కండ్లుపచ్చనగును. జీర్ణశక్తియుండదు. చురుకుదనము నశించును. మట్టితిను అలవాటు యీసమయముననే కలుగును. బుగ్గలు మామూలుకంటె ఉబ్బినట్టుకానుపించును. త్వరలోకనుగొనుట మంచిది. లేకున్న రక్తహీనమై తూకముతగ్గును. పలుమారు మూత్రముపోయుదురు.

21 సుద్దపడుట :- ఇది గమనించతగిన విషయము తలిదండ్రుల తత్వమునందు మేహము, ఉపుకుకలిగియున్నవారలకు జనించిన శిశువులకు మూత్రములో తెల్లనిపిండిపదార్థము కలసిపోవును. గచ్చునేలమీద మూత్రముపోసిన స్పష్టముగ సులభముగ తెలుసుకొనవచ్చును. ఇది యుండినపిల్లలు వారివయస్సునకు తగినట్లు కనుపించరు. ముఖ్యముగ ఆడపిల్లలకు కలిగిన త్వరలో జాగ్రత్తపడుట మంచిది. లేకున్న రజస్వలదోషములు కల్గును. అంగసౌష్టముకలిగియుండరు. తలిదండ్రులు పరుగులిడి లేనిపోని వైద్యములు చేయించుటకు ప్రారంభింతురు.

22 విసర్పము :- పసిపిల్లలకు వాత, పిత్త, శ్లేష్మ దోషముల వల్ల కలుగును. ఇది శిరస్సునందుగాని, బొత్తికడుపుమీదగాని తామరాకు రంగుమాదిరిగ లేచును. క్రమేణగుదప్రదేశమున, ప్రవేశించును. దీనినే తిమ్మియనికూడఅందురు. కొందరు అనాసయనికూడా చెప్పుదురు. దీనికి పైపూతకు, లోపలికి, మంచులను వాడుట శ్రేష్టము. తీక్షణమయిన మందులు అనవసరము.

---

## పాణిగ్రహణం

వెల్లుర్తి మాణిక్యారావు

గ్రహణం, పాణిగ్రహణం
ఎవ్వరినీ—ఎవ్వరికీ
ముక్కు వచ్చలారనట్టి
పక్క సరిగ పరువలేని
సిగ్గుమాట ఎరుగనట్టి
మొగ్గవంటి, మొక్కవంటి

అమ్మాయిని తాతయ్యాకు
అంటగట్టుటే పనియా ?
ఎడపెడగా పెట్టుముఖాల్
మెడవంచీ కాడిగట్టి
లగ్నంబను ముకుద్రాళ్లను
లాగిబిగించుటె పనియా ?





జాంగ్రి తయారు చేయువిధము :

1 ఉద్దిబేడలు బాగదంచి నల్లనిపొట్టుతీసివేయవలెను అదిపోగా మిగిలిన తెల్లనిపప్పును నీటిలోపోసి, బాగుగకడిగి, అట్లే, నీటిలో కాలుగంటసేపు నిలువజేయవలెను తరువాత రోటిలోవేసి నున్నగ రుబ్బవలెను. దీనిని బాణలిలోవేయుటకు మునుపు, కాలుగజము గుడ్డతీసికొని, దానిమధ్యలో కందిబేడ దూరునంతటి సందుచేసినతరువాత, ఆసందు అంచులను సన్నటి దారముతో కుట్టవలయును.

2. అటుతరువాత పంచదారను వెడల్పైనపాత్రలోవేసి, దానికితగిన నీరుపోసి, పొయ్యిమీదపెట్టి సరియైనపాకుచేయవలెను.

పాకుఅయినదా, లేదాయని పరీక్షచేయుట .

పాకులో పొరకపుల్లనుంచి, బయటతీసి నేలమీదపెట్టినప్పుడు, గుండ్రముగను, తెల్లగనువుండును. ఆపాకుకు కేసరిరంగు వేయవలెను.

3 వెడల్పుగనుండెడి బాణలిలోనెయ్యిపోసి సన్ననిమంటతోనే సలసలకాగబెట్టవలెను కాగినవెంటనే, పైజెప్పిన ఖాజాగుడ్డలో, రుబ్బినముద్దనుపెట్టి, గుడ్డయొక్క రెండేసికొనలుచేర్చి బాణలిలో, ఒకచుట్టుగుండ్రమువేసి, దానివైపుననే, చిన్నచిన్న గుండ్రములు చుట్టవలెను.

4 బాణలిలో ఒకతూరి 7 లేక 8 జాంగ్రీలు వేయవచ్చును. సమముగకాలినవెంటనే, వీటినితీసి పైచెప్పిన పాకులోవేయవలెను. అట్లేపదినిమిషములు పెట్టి తరువాత వేరేతట్టలో పెట్టవలెను.

5. ఈవిధముగ ఎన్నికావలసినను చేయవచ్చును. ఇట్లుచేసినజాంగ్రి, చూచుటకు అందముగను, తినుటకు రుచిగానువుండును.

కె. సుందరాబాయి

ఆలుగడ్డలబాత్ .-బంగాళాదుంపలకే అలుగడ్డలనికూడా చెప్పుదురు. సన్నబియ్యము వండి జలజలవుండేలాగు వార్చవలయును అంటే మెతుకునకుమెతుకు కరుచుకోకుండా వుండవలయును. శేరుబియ్యమునకు అరవీశె ఆలుగడ్డలు ఉడికించి సుమారుగవెచ్చగనుండగనే చెక్కునువలిచి వేయవలయును. వాటినిముక్కలగునట్లు చేయవలయును. మసాలసామగ్రిని సిద్ధముగా నుంచుకొనవలయును. యాలకులు, లవంగాలు, దాచినచెక్క, కరివేపాకు, పచ్చిమిరపకాయలు, కొబ్బరితురుము వీటినన్నిటిని నూరి ముద్దగ చేసుకొనవలయును అముద్దను సుమారు 2½ ఫలముల నెయ్యి బాగుగా మరగినతర్వాత వేయవలయును. యెర్రగ వేయించవలయును. వేగినతర్వాత వండిన అన్నమును వకవెడల్పాటి గిన్నెలోవేసి బాగా కలిపి మూతపెట్టవలయును. తగుమాత్రము ఉప్పుకారము వేసుకొనవచ్చును. సులభముగ త్వరలో తయారగునది. సామాన్యముగా అందరకు ఇష్టమైనది.

విజిటెబిల్ బోండా :

లేక కదంబము బోండా చేయువిధానము .బంగాళాదుంపలు, చిలగడదుంపలు, క్యాబేజి, ఉల్లిపాయలు, బటాని, బీట్‌రూట్, ముల్లంగి మొదలయినవాటిని ముందు బాగా కడిగి, చిన్నచిన్న ముక్కలుగా తరుగవలయును వీటిలోఅన్నియు కొంతమందికి యిష్టముండవు గాన యిష్టమయినవాటిని కంటికియింపైన వాటినిసేకరించి యుంచుకొనుటమంచిది.

కొతిమెర, అల్లం, పచ్చిమిరపకాయలు, పచ్చికొబ్బరను మెత్తగానూరివలయును. ఈనూరిన దానిని వకపళ్లెములో వుంచుకొనవలయును.

పైముక్కలనుఉడుకబెట్టి నీరునంతా వంచివేయవలయును తిరగబోతవేయవలయును. అందులో ఆవాలు, శనగపప్పు, మినపపప్పు, జీడిపప్పు, కరివేపాకు మొదలయిన వాటినివేయవలయును. బాగా కదిలించవలయును నిప్పులపైన కొంచెముసేపువుంచి మూతవేయవలయును

ఒకగిన్నెలో పూరనంతటినివేసి బాగాకలిపి వుండలుకట్టవలయును. కట్టుటకుముందు ఉప్పును చేర్చుటకు మరువకూడదు. ఇందులకు సరిపోవునట్లు మైదాపిండినిచిక్కగా కలుపవలయును, దానిలో కొంచెముఉప్పు, నిమ్మకాయరసము జీలకర్రనుకూడ చేర్చవచ్చును

మంచినూనెను బాగాకాచి యీ వుండలను పిండిలోముంచి నూనెలో నెమ్మదిగా వేయవలయును. అవి తయారయిన తర్వాత వేడిగాకూర్చొని తినిన బాగుండును

# గృహలక్ష్మి పాకకళ

శాస్త్రయుక్తమగు పాకకళా రహస్యములను తొలుత "గృహలక్ష్మి"లోను, పిదప పుస్తక రూపముననుప్రచురింపవలయునని మా యుద్దేశము. అందుకుగాను పాక కళా వేత్తలైన "గృహలక్ష్ములు" తమ అనుభవముల ననుసరించి వివిధపాక విశేషముల తయారుచేయు విధానమును వ్రాయుచో — వారి వారి పేర్లతోనే పత్రికయందును, పుస్తకమందును ప్రచురింపబడును. కావున అట్టి వారెల్లరు తప్పక వ్రాసిపంప ప్రార్థితులు.

గృహలక్ష్మి సంపాదకులు

---



# బ్రతుకు తెరువు



గులాబి షర్బత్-Rose Sherbet చేయు విధానము చాలా సులభమయిన పద్ధతి. సిరప్ పాకవిధానమును గురించి గతసంచికలలో వివరించియుంటిమి. అరవీశెడు గరుకు పంచదారను తగునట్లు నీళ్లలోపోసి పాకము తయారుచేసుకొని వుంచవలయును. అందులకు తగినట్లు 5_6 ఔనుల రోస్‌వాటరులో ఆ పాకమునుపోసి మరల కాచుము. 4 ఔనులు అగునంతవరకుదిగకాచి వడబోసి చల్లారనిచ్చి సీసాలకునింపుము. వకవేళమంచి సువాసననిచ్చు రోస్‌వాటరు సందర్భపడనియెడల ప్రతి 1 ఔనుకూ సుమారు 60 చుక్కలు యెస్సెన్సును చేర్చవచ్చును. ఇటులనే అనేకవిధములగు షర్బత్‌లను పలువిధములగు పుష్పముల సువాసనలతోగాని పండ్లతోకాని తయారుచేసి విక్రయించుకొనవచ్చును.

వీలగునట్టి వాటిలో ముఖ్యముగ దానిమ్మ, నిమ్మ, వెలగపండులతో తయారు చేయుట ఆరోగ్యదాయకమైయుండును.

బెల్లపుకడ్డీలు లేక పంచదార కడ్డీలు.—

స్వల్పవ్యయముతో తయారొనర్చుకొని పాఠశాలల ఆవరణముల ముందును క్రీడాస్థలముల యందును చాక్‌లెట్సు, నిమ్మతొనలు, పెప్పరమింట్సుతో కూడా బెల్లపు కడ్డీలు, పంచదార కడ్డీలను విక్రయించుట మనకు తెలిసినవిషయమే. అట్టివమ్మువాని గొంతుసవ్వడిగాని, గంటగాని వినగానే పిల్లలుపరుగిడుదురు. వారి కనుకూలమగు ఈ-యీపదార్థములను చేయువిధానము.

అరవీశె చక్కెర, సుమారు 2 ఔన్సులు నీళ్లు, కొంచెమువెన్న, సువాసననిచ్చు యెసెన్సు, కావలయు రంగుపదార్థము.

నీళ్లలో చక్కెరనుపోసి బాగా కరుగనివ్వవలయును. అందులో వెన్నను కల్పుము. బాగా కలియునట్లు త్రిప్పుము. బాగాకాచి గీట్లుగల పాకమునకు దిగినప్పుడు వెడల్పయిన నున్నని నాపరాయివంటి దానిమీద పోయుము. కావలయు వాసనయు, రంగునుకూడ చేర్చుము. దానిని కొయ్యతెడ్డుతో బాగామర్దనచేయుచూ చల్లారినపిదప రెండుచేతులతో బాగాలాగుచూ చుట్టగానుండునట్లు చేయవలయును. అట్లు కాడగావచ్చుదానిని వకఅంగుళం ముక్కలుగాను లేదా మూడు మూడు అంగుళముల కోపులుగాను తయారుచేసి చెడిపోకుండ మంచిడబ్బాలోగాని జాడీలోగానివేసి వ్యాపారయుక్తమగు పేర్లతో చీట్లు అంటించుకొని విక్రయమునకు పెట్టవలయును ఇట్లుచేసిన నిత్యజీవనము సామాన్యముగ గడచును.

శొంఠి, దాచినచెక్క, వాసనలు, పసుపురంగు కొన్నిటికి అనుకూలముగ నుండును. సామాన్యముగా బొంబాయి మిఠాయి అనికేకలు వేయుచూ వీధులవెంట తిర్గుచూ కర్రపైన వకేముద్దగా రంగు రంగులతో వున్నదానిని కాడలుగ తీసి అమ్ముచుందురు. మొవరెవరికి యేవికావలయునో తీసుకొనుచుందురు.

# ఇంటిపనులలో మెళకువలు

(గతసంచిక తరువాయి)

వీధివాకిట్లో తరచుగా నిలువకు, అక్కడనిలిచినప్పుడు అ కారణంగా వెకిలినవ్వు నవ్వకు.

♦ ♦ ♦

వీధివాకిటనిలిచి తలదువ్వుకోవడం, జడఅల్లుకోవడం, రవికతొడుక్కోవడం, విడవడం, పైటసర్దుకోవడం, కుచ్చెళ్లు సవరించుకోడం, మొదలైనపనులు చేయకు. ఈపనులు ఇంటిలోపలకూడా ప్రత్యేకంగా నీగదిలోగాని, లేక మరో చిన్నగదిలోగాని, చేయవలెనుగాని - హాలులో చేయరాదు. తప్పని సరియైతే హాలుతలుపుగడియ, ఆకాస్తసేపు వేయుము.

♦ ♦ ♦

దగ్గడం, తుమ్మడం, ఉమ్మడం, చీదడం, ఆవులించడం, మొగంచిట్లించడం, విరగపడినవ్వడం, రాగాలుపెట్టి ఏడ్వడం - పరులఎదుట ఎప్పుడూ చేయనేచేయకు, భర్తఎదుటనైనా అవశ్యమైతే తప్ప చేయరాదు.

♦ ♦ ♦

ఇంట్లోఉన్న చిన్నపాత్రలు, పెద్దపాత్రలు లెక్కచూచి పెట్టుకో, వారానికొకసారైనా అవి ఎక్కడెక్కడ ఉన్నవో చూచుకో వాడేపాత్రలు, సరే, రోజూ తోముకో, లేదా తోమించుకో. వాడని పాత్రలైనా అరిగిపోతవనుకోక వారాని కొకసారైనా తోమించు లేకపోతే కరలుగట్టి, కిలుమెక్కి అవసరమైన రోజున అరవీశచింతపండు ఖర్చుచేసినా - అట్లాగే ఉండిపోతవి.

♦ ♦ ♦

సాధ్యమైనంతవరకు ఎవరివద్ద పాత్రసామాను ఎరువుతేవద్దు అవసరమై తెచ్చినప్పుడు, పనికాగానే తాత్సారంచేయక వెంటనే తిరిగీ వారివి వారికి ఇచ్చివేయి. నీసామాను ఒకరికి ఎరువు ఇచ్చేటప్పుడుకూడా అదే న్యాయసూత్రము.

♦ ♦ ♦

ఎప్పుడూ, కలలోనైన, ఇతరులనగలు ఎరువుతేవద్దు, నీనగలు ఇతరులకు ఎరువు ఇవ్వవద్దు ఎంత మొగమోటస్తులైనా అంతే; తల్లీ బిడ్డా, అక్కాచెల్లెలు - మధ్యకూడా ఇదేమర్యాద శ్రేయస్కరము. ఎరువులసొమ్ములు బరువులచేటు, అవితీయను పెట్టను తీపులచేటు; ఆకాస్తాపోతే అప్పులచేటు - అనే సామెతవిన్నావుకదా ?

♦ ♦ ♦

నీభర్త నెలసరి ఆదాయంలోనే - ఒకరూపాయ మిగిలేటట్టుచూచి - ఇంటిఖర్చు సర్దుబాటుచేయుము. మంచమున్నంతవరకు కాళ్లుముడుచుకోవాలి, పిండికొద్దీ రొట్టె.

♦ ♦ ♦

నీభర్త, పిల్లలు-చొక్కాలు, పంచలు, విడువగానే మాసిఉంటే, మార్చి చలవచేసినవి వంకెలనుంచు. తగినన్ని చలవజేసినవి లేనప్పుడు మెళుకువతో వానిని సబ్బుతో ఉతికి ఆరవేసి, సమయానికి వారికవి అందించు. వాళ్లు తీరా ఆఫీసుకో, బడికో, మరెక్కడికో వెళ్లబోయేటప్పుడు, "ఇంకా జేబులు ఆరలేదండి, మెడవద్ద చల్లగా ఉందండి," అని అంటే, వారికెంతో చికాకువేస్తుంది. బాగా ఆరకున్నా, ఆరిందని చేతికిస్తే - ఇక చెప్పాలి.

♦ ♦ ♦

చొక్కాలు మార్చేటప్పుడు బొత్తాములు, జేబులో కాకితాలు, వస్తువులు పరాకులేకుండా జాగ్రత్తగాతీసి

మరో చొక్కాజేబులో పెట్టు, లేదా భద్రంగా ఉంచి ఆరినచొక్కా జేబులలో పెట్టు. ఏ వస్తువు అనవసరమైనదని పారవేయకు.

♦ ♦ ♦

చొక్కాలు పంచలు, లాగులు, చిరిగితే చూచినవెంటనే కుట్టివేయి. చాకలితెచ్చిన చొక్కాలు - తొడుగుకోవలసివచ్చేదాకా నిదానించక ఆలోపుననే చినిగినవేమో చూడు. చినిగిఉంటే వానిని వెంటనే కుట్టు, లేక కుట్టించు. అంచులు బండదెబ్బలకు పీచురేగి దారాలు వేలాడుతుంటాయి, వాటిని జాగ్రత్తగా కత్తిరించి కలియకుట్టు.

♦ ♦ ♦

నీయింటిలో పెద్దఅద్దం ఉండాలని ఎప్పుడూ కోరుతావు, అది మంచికోరికే. దానిని నీఇంటిలో సరియైన స్థలాన అమర్చడంలో నీచాకచక్యం తెలుస్తుంది. వీధిలోకి ఏమూలనుంచైనా, ఏకిటికీగుండానో, ఆ అద్దం కన్పించరాదు. నీవు ఆ అద్దంలో చూచుకుంటూ తలదువ్వుకొనేటప్పుడు, చీరశింగారించేటప్పుడు, బొట్టూ కాటుక దిద్దుకొనేటప్పుడు, హారాలు సర్దుకొనేటప్పుడు నీవెంతతలుపు గడియవేసినా, నీఅందం నీకేగాక వీధినిపోయేవారికి వెల్లడి అవుతుంది. ఒంటరిగా అద్దంచూచుకొనేటప్పుడు మొగం చిట్లించడం, వికారంచేసి చూచుకోవడం - అందరికీ మామూలు. అవన్నీ వీధికెక్కుతాయి. ఏమూలకూచొని నీవేమి చేస్తున్నా అది అద్దంలో ప్రతిఫలించి వీధినిపడుతుంది, జాగ్రత!

♦ ♦ ♦

సూర్యరశ్మిగాని వెల్తురుగాని ప్రక్కవాలుగావచ్చి అద్దంమీద పడాలిగాని ఎదురుగావచ్చి పడరాదు. దానివల్ల అద్దంలోచూచినప్పుడు వెక్కసమై కళ్లుచెదురుతవి.

♦ ♦ ♦

ఇంటిలో కలహం వీధికెక్కించకు, పొరుగింటి కలహంలో వ్రేలుపెట్టకు. ఎవరితో కలహంవచ్చినా పెంచకు, ఎక్కడి కక్కడికి తుంచి సమాప్తిచేసివేయి.

♦ ♦ ♦

ఇంట్లో ఏసామానులేకపోయినా, అదిలేకుండానే ఆనాటికి సర్దుకో. చేటపట్టుకొని ఇంటింటికి అప్పులకువెళ్లకు. నీయింటికి అప్పులకువచ్చినవాళ్లను చిన్నపుచ్చిపంపకు. నోటితో లేదనేది చేతితో లేదను. తీసుకొనిపోయి తిరిగియివ్వరని నీకుతెలిసినా ఒక్కసారి ధారాళంగాఇయ్యి. అది తీర్చనిదే తిరిగి ఆమె నీగుమ్మం ఎక్కదు. నీవులేదనేకొద్దీ పదేపదే ఆమె రావచ్చు. అదినీకుచికాకు.

♦ ♦ ♦

అత్యవసరమైనచో, అతిచనువు స్నేహముఉన్నవారివద్ద ఏవస్తువు అప్పుతెచ్చినా నిద్రచేయకుండా తీర్చివేయుము. కనీసంవారు అడగకముందే తీర్చివేయుము.

♦ ♦ ♦

ఏగదిలోగాని ఒకటి రెంటికంటె హెచ్చుగా పటాలుంచకు. ఆపటాలైనా ఆదర్శమో, అందమో, మధురస్మృతియో, పవిత్రసంస్మరణమో కలవై ఉండాలిగాని, - అశ్లీలములు, అందవికారములు అయినవిగా ఉండరాదు. మంచివికదా అని గోడలనిండా పటాలు తగిలించకు - అట్లయితే, పటాల అంగడికి, నీయింటికి భేదమేమున్నది?

♦ ♦ ♦

ఇంట్లో గదులలో ఎన్నిముగ్గులుపెట్టావు అనిచూడరు; ఎంతశుభ్రముగా ఉంచావు అనిచూస్తారు.

ఇంట్లో ఎంతసామానున్నా - దాన్నంతా నట్టింట అపర్చక ప్రక్కలన అందంగా అమరిస్తే నిన్ను మెచ్చుకుంటారు. ఇంట్లోకివచ్చి పోయేమనిషికి, సామాన్లు, మోచేతులు మోకాళ్లు కొట్టుకుండేట్లుండరాదు.

♦ ♦ ♦

ఇంట్లో అవసరమైనవస్తువులు జతగూర్చడంలోనే కాదు నీనేర్పు, అనవసరమైన వస్తువులను విసర్జించడంలోకూడా చూపాలి ఆనేర్పు

♦ ♦ ♦

స్వంత ఇల్లేకానక్కరలేదు, ఎవరియింట్లో అద్దెకు కాపురమున్నా సరే - నీవు ఉన్నంతవరకు నీయిల్లే. గుమ్మాని కిడాపెడా మంచి పూలమొక్కలుంచు. నేలలో పాతడానికి వీలులేకపోతే - పూలతొట్లలోనైనా పెంచు ఇంటికివచ్చినవారిని వాకిట్లో పచ్చనిచెట్లూ, కమ్మనివాసనగలపూలు - నీకంటేముందు ఆహ్వానించి, ఆతిథ్యమిచ్చి, ఆనందింపచేయగలవు.

♦ ♦ ♦

పగటిపూట నిద్రబోకు, అలవాటైతే మానడానికి ప్రయత్నించు.

♦ ♦ ♦

చేతనైనంత చురకుగా, చెడకుండా పనులుచేసుకో వీలైనంత తీరిక రోజూ సంపాదించు. ఆతీరిక వేళను, విద్యావినోదాలలో గడపి, నీభర్తకు బిడ్డలకుఉల్లాసము కల్పించి, నీవూ వారితో చేరి ఆనందించు.

(సశేషము)

# శ్రీ మీనాక్షి సుందరేశ్వర్ దేవాలయం: మధుర.

శ్రీ కె. కె మీనన్, బి. యె., బి. ఎల్.

(మధుర దేవాలయాల సూపరింటెండెంట్)

ఇప్పటి ఇండియా గవర్నర్ జనరల్ శ్రీమాన్ రాజగోపాలాచారిగారు వెనుక మదరాసు రాష్ట్ర ప్రధానిగావున్నప్పుడు హరిజనులకు ప్రవేశం కల్పించబడిన దేవాలయాలలో శ్రీ మీనాక్షి సుందరేశ్వర్ దేవాలయంఒకటి. అప్పటి ఈసంఘటన ఆసేతుశీతనగపర్యంతం భారతప్రజలదృష్టిని తిరిగి ఆకర్షించింది. ఈ ఆలయం ఒక్క మతభక్తి జిజ్ఞాసువుల హృదయసీమలలోనేగాక, శిల్పకళాప్రాభవంపట్ల ఆసక్తికల యావన్మంది ప్రజల హృదయాంతరాళాలలోను, శతాబ్దాలతరబడి ఒక విశిష్టస్థానం ఆక్రమించుకొంటూ వుంది.

ఇండియాలోని అత్యంత పురాతనదేవాలయాలలో ఒకటైన ఈ గుడిని ఇంద్రుడే నిర్మించాడని ఇతిహాసాలు చెబుతున్నవి. తమిళ విజ్ఞాన సంస్కృతులకు మధుర ఒక ప్రసిద్ధ కేంద్రమని గాథలు చెబుతాయి. కోవెలలోని చక్కని కొలనును స్వర్ణపద్మ సరోవరమని పేర్కొంటారు. ఈ కోనేరుప్రక్కనే ప్రసిద్ధి పొందిన "సంఘం" కవులుకూర్చుని, సారస్వత గోష్ఠి జరిపేవారని, వీరు ఉపవిష్టులయ్యే బల్ల ఇప్పటికీ ఈ కొలనులోనే వుండాలని పెద్దలు చెబుతారు.




ప్రపంచ విఖ్యాతి నందిన కవికులాలంకారుడు తిరువళ్లువరు తన అమర కావ్యం-తిరుకురల్ రచనను ఈ ఆలయంలోనే ప్రారంభించాడట. పూర్వపు రాజవైభవానికి, భారతీయ శిల్పచిత్రకళాప్రాభవానికీ, కళాప్రౌఢిమకూ ఇది అనన్యతారాకాణమని చరిత్ర సూచిస్తుంది. అయితే ఈ మహాప్రఖ్యాతదేవాలయ చరిత్ర ఇప్పటికీ కొంతవరకు నిగూఢంగానే వుందని చెప్పకతప్పదు.

## దేవాలయానికి చెందిన గాథలు

ఈ దేవాలయం పుట్టుపూర్వోత్తరాలకు సంబంధించిన ఒకగాథ స్థలపురాణంలోవుంది. అది యిది. ఒకనాడు ఇంద్రుడు అచ్చరల నృత్యకళాసందర్శనోత్సుకతలో దేవగురువు బృహస్పతి రాకను గమనించక పోగా, ఆయన కినుకవహించి వెంటనే ఇంద్రసభనుంచి వెళ్లిపోయాడు గురువు నిర్గమనంతో దేవతలు దుర్బలులైపోగా రక్కసులువచ్చి, ముట్టడించి, దేవతలను నిర్జించారు. దేవతలు బ్రహ్మను సమీపించి, తమ్ము రక్షింపుమనికోరగా, ఇంద్రుని సూచనపై చతుర్ముఖుడు విశ్వరూపుడనే మూడుతలలవానిని బృహస్పతి స్థానంలో గురువుగా వ్యవహరించడంకోసం నియమించాడు. విశ్వరూపుడుకూడా రాక్షసప్రవృత్తే కలవాడు కావడంవల్ల యాగంచేసి, రాక్షసులను దీవించి, రహస్యంగా దేవతలనే శపిస్తూవచ్చాడు. ఇదితెలిసి, ఇంద్రుడు ఆగ్రహోదగ్రుడై విశ్వరూపుని మూడుశిరస్సులను ఖండించగా అవి మూడుపక్షులుగామారి ఎగిరిపోయాయి. విశ్వరూపుడు బ్రాహ్మణుడుకావడంవల్ల బ్రహ్మహత్యాదోషభయం ఇంద్రుని పీడింప సాగింది, అయితే ఇతరదేవతలు ఆ పాతకాన్ని నాలుగుభాగాలుగా విభజించి, చెట్లకు, స్త్రీలకు, భూమికి, జలానికీ పరివ్యాప్తంచేసి, పాపం ఇంద్రుని అంటకుండా పరిహరించారు. విశ్వరూపునితండ్రి ఒకయజ్ఞంలో సృష్టించిన మరొక అసురుడు వృత్రుడనేవాడు ఇంద్రుని నిర్జించాడు. ఇంద్రుడు శ్రీ మహావిష్ణువు సహాయ మర్థించగా, ఆయన దధీచి అనే మహర్షి అమృతమథనసమయంలో దేవతలిచ్చిన ఆయుధాలన్నిటినీ తన శరీరంలోనే నిక్షిప్తమొనర్చుకున్నాడనీ, ఆ మునీశ్వరుని వెన్నెముకతో వజ్రాయుధాన్ని నిర్మించి వృత్రాసురుని పరిమార్చవచ్చునని సూచించాడు. ఇంద్రుడు దధీచిని బ్రతిమాలగా, ఆయన తన వెన్నెముక నిచ్చాడు. వజ్రాయుధద్వితీయుడై ఇంద్రుడు వృత్రాసురునికోసం వెదకగా, అతడు భీతచిత్తుడై సముద్ర మధ్యంలో దాగొన్నాడు. ఇంద్రుడు ఈసారి అగస్త్యమహామునిని తనకు తోడ్పడవలసినదిగా కోరాడు. అగస్త్యుడు సప్తసముద్రాలలోని జలాన్ని ఒకగ్రుక్కను త్రాగివేశాడు ఇంద్రుడాతనిన్ని, సంహరించాడు. వృత్రాసురుడుకూడా బ్రాహ్మణుడేఅగుట ఇంద్రునికి మళ్ళీ పాపశంకజనించి, ప్రాపంచికసుఖాలనురోసి, ఒకకొలనులోని, కలువలో దాగుకొన్నాడు. శతాశ్వమేధ యాగమొనరించిన నహుషుడు ఈలోపుగా దేవలోకములోని మహేంద్రపదవి నాక్రమించుకొన్నాడు. ఇంద్రాణినికూడా తానే భర్తగాఏలుకోదలచి నానని చెప్పగా, ఇంద్రాణి విని సప్తర్షులు మోయగా పాలకీనెక్కివచ్చిన పక్షంలోతాను అతనిని పతిగా స్వీకరించగలనని చెప్పింది. పాలకిని మోయడానికి నహుషుడు సప్తర్షులను అజ్ఞాపించగా, వారువిసిగి, కోపోద్రిక్తులై నహుషుని సర్పమవు కావలసిందని శపించారు. స్వర్గలోకముతిరిగి అరాచకమయింది. బృహస్పతి దేవలోకానికి తిరిగివచ్చి, ఇంద్రునిరావించి, తనయెడల అతడు చేసినఅపరాధానికి క్షమించానని అన్నాడు. పుణ్యస్థలములకుపోయి, తీర్థాటనచేసి, పాపపంకిలమునుంచి విముక్తుడవుకమ్మని బృహస్పతి దేవేంద్రునకు సలహా యిచ్చాడుకూడా. మహేంద్రుడు తీర్థయాత్రలనుప్రారంభించాడు. ఎన్నోదివ్యస్థలాలను దర్శించాడు. కాని అతని చిత్తానికి శాంతిలభించలేదు. తుదకు ఒక కదంబవనానికివచ్చాడు. అది సుగంధ సంభరితమై, పవిత్రంగా కనిపించింది. పరస్పర శత్రుత్వంగల పులులు, సింహాలు, ఏనుగులు కలిసిమెలసి, ఎంతో స్నేహంగా మసలుతున్నాయి. శుకసందోహాలు వేదాలు వల్లిస్తున్నాయి. తన ఆరాటం తొలగ

దగుమార్గమేదా అని అన్వేషిస్తున్నసమయంలో అతనికి ఒక 'లింగం' శివవిగ్రహం కనిపించింది. వెంటనే దేవశిల్పి విశ్వకర్మను పునిరావించి, ఇంద్రుడు ఆ లింగం కనిపించినచోట ఒక సుందరమైన ఆలయం నిర్మింపజేశాడు.

ఆ ఆలయానికి దేవత శ్రీమీనాక్షి. ఆమె అక్షులు చేపకన్నులవలె వుంటాయి చేప నీటిలో ఈదుతూనే గ్రుడ్లుపెడుతుందనీ, గ్రుడ్లవంక ప్రేమార్ద్రమైన చూపులు ప్రసరిస్తేనే అవి పొదుగుతవని చెబుతారు. అలాగే మీనాక్షి తనబిడ్డలను ప్రేమవాత్సల్యపూరితములైన దృక్కులతోనే ఆశీర్వదిస్తోందట. మీనాక్షి పురాతన పాండ్యరాజులలో ఒకడైన మలయధ్వజపాండ్యుని కుమార్తెఅట. అతడు మధురప్రాంతాన్ని పాలిస్తూవుండేవాడు. శివభక్తాగ్రగణ్యుడు, సంతానహీనుడు. కాగా రాణీ కాంచనమాలతో కలిసి భగవంతుని ప్రార్థించి, తుదకు పుత్రకామేష్టి యాగం చేశాడు. యజ్ఞహోమగుండంనుంచి మూడేళ్లవయస్సుకల ఒక చక్కని చుక్క ఉద్భవించింది. రాజు రాణి అమితానందభరితులయ్యారు అయితే ఆమెకు మూడు స్తనాలుండడంచూసి, ఆ దంపతులు దుఃఖభారాన క్రుంగిపోయారు ఆమె తనకు కానున్న భర్తనెప్పుడైతే చూస్తుందో, అప్పుడే ఆ మూడవ స్తనం మాయంకాగలదని ఆకాశవాణి పలికింది.

తలిదండ్రులు ఆమెకు తటాతక అని పేరుపెట్టారు. పెద్దదైనపిదప ఆమె మధురకు రాజ్ఞియై, పరిసర ప్రాంతాలలోని రాజులను జయించింది ఆమె ఈశాన్యదిశగా వెళ్లగా, సుందరేశ్వరుడు (శివుడే) తారసపడి ఆమెతో యుద్ధానికి నిలిచినాడు. ప్రథమసందర్శనంలోనే ఆమె మూడవ స్తనం మాయమైంది. అతడే తనకు భర్తకాగలడని, ఆమె గ్రహించింది సిగ్గుదొంతరలు ఆమె ముఖముందలాన చిందులాడినవి. బాణ తూణీరాలనువదిలి లజ్జావనతవదనయై నిలిచియున్న ఆమె మనోరథమునుగ్రహించి, తనరాజ్యమునకు తిరిగివెళ్లిపోవలసినదనీ, ఎనిమిదవనాడు తానువచ్చి పరిణయం చేసుకొంటాననీ శివుడుచెప్పాడు.

అన్నట్లు ఎనిమిదవనాడు శివుడు మధురకువెళ్ళి, మీనాక్షిని పెళ్లిచేసుకొన్నాడు. దంపతులు ఆరు మాసాలపాటు రాజ్యంపాలించారు. మీనాక్షిదేవి పట్టాభిషేకం, ఆమె దిగ్విజయం, కైలాసాధినాథునితో ఆమె వివాహం ప్రతిఏటా చిత్రోత్సవసందర్భాన మహావైభవంగా జరుపుతూవుంటారు.

శివుని పట్టాభిషేకోత్సవాలు ఆవణినెలలో జరుగుతవి. ఈ దంపతులకు ఉగ్రపాండ్య - (సుబ్రహ్మణ్యేశ్వరుడు) కుమారుడుగా జన్మించాడు మీనాక్షిసుందరేశ్వరులు రాజ్యాన్ని సుబ్రహ్మణ్యేశ్వరునకిచ్చి, కైలాసానికి వెళ్లిపోయారు.

## చరిత్రాంశాలు

ఇక చరిత్రను పరిశీలించగా ఈ దేవాలయాన్ని, గోపురాలనుకూడా తొలి పాండ్యరాజులు నిర్మించారని తెలుస్తున్నది. అయిదవశతాబ్దంలో నివసించిన మాణిక్యవాచకర్, ఇతర తమిళకవులుకూడా ఈఆలయం గర్భగుడి (వెలియాంబలం) ఇతర గోపురాలుకూడా ఇంకాముందే నిర్మించబడియుండినవని చెబుతున్నారు.

'తిరువాళవాయి కోయిల్ తిరుప్పణిమాలై' అనే ప్రజారంజకమైన తమిళకీర్తనలో ఆలయభాగాలు నిర్మించబడిన తేదీలు యీవిధంగా నిర్మించబడ్డాయి.

1. దేవాలయం: కులశేఖరపాండ్య, ఇతర పాండ్యాలు.
2. సిద్ధర్ గుడి: విక్రమపాండ్య.
3. తూర్పుగోపురం: 1140 శాలివాహనశకం.
4. అమ్మన్ సన్నిధిగోపురం. ఆనందతాండవనంబి, (శాలివాహనశకం 1150)
5. కుడ్యాలు: పశ్చిమగోపురం. పరాక్రమపాండ్యా. (1245 శాలివాహనశకం)
6. స్వామిసన్నిధి గోపురం. వానువప్పన్ (1264 శాలివాహనశకం)
7. పల్లియార: అమ్మన్‌సన్నిధి మొదటిమార్గం—మహాబలి
8. దక్షిణగోపురం సిరిమలైశివాంది. (1400 శాలివాహనశకం)
9. శివుని ద్వారపాలకులు, స్వర్ణపద్మసరోవరం ఉత్తరపుగట్టు: పెరుమాళ్ (1486 శాలివాహన శకం)
10. ధ్వజస్తంభం, సంబంధర్ మండపం, సహస్రస్తంభమండపం, ఉత్తరగోపురం. కృష్ణనాయక్ (శా. శ. 1484)
11. వివాహమండపం విజయరంగనాథనాయక్. (1633 క్రీ. శ.)
12 పుదుమండపం తిరుమలనాయక్.

అయితే చరిత్రకారులు ఈ తేదీలకు అధికప్రాధాన్యం ఇవ్వడంలేదు. క్రీ. శ 1310 లో మాలిక్ కాఫర్ దండయాత్రజరిపినపుడు పాండ్యరాజులు నిర్మించిన భవనాలన్నిటినీ ధ్వంసంచేశాడనీ, శ్రీమీనాక్షి శ్రీ సుందరేశ్వరుల గర్భగుడులు మినహా మిగిలిన దేవాలయాన్ని పూర్తిగా శిథిలంచేసి వెళ్లాడనీ వీరు చెబుతున్నారు. మాలిక్ కాఫర్ సైన్యంలోని విభేదాలవల్లనే ఈగర్భగుడులైనా రక్షించబడినవని చరిత్రకారులు సూచిస్తున్నారు. తూర్పుగోపురంపైనగల ఒక శాసనాన్నిబట్టి దానిని సుందరపాండ్యాఅనే రాజు నిర్మించినట్లు వ్యక్తమాతున్నది. లక్కన్నఅనే నాయకుడు పాండ్యవంశీయులను నలుగురిని 1451 లో మధురకుగొనివచ్చి, ఒకరిని సింహాసనాసీనని జేసినట్లు నెల్సన్ తన గ్రంథంలో పేర్కొన్నాడు. వారు సుమారు 48 సంవత్సరాలపాటు కొంత రాజకీకాధికారాన్ని చెలాయించారనీ, వీరిలో ఒకరు ఈ మహోన్నతగోపురాలను నిర్మింపజేసివుండడం అసంభవంకాదనీ నెల్సన్ వ్రాశాడు. ఈ గోపురాలలో ఉత్తరగోపురం అసంపూర్తిగావుండేదనీ, అది 19 వ శతాబ్దంలోనే పూర్తిఅయినదనీ తెలుస్తున్నది. ఆలయంలోని ప్రధానభాగాలు 16 వ శతాబ్దందాటి నిర్మించబడివుండవని వ్యక్తమాతున్నది కొన్ని సహస్రస్తంభమండపంతోసహా వీరప్పనాయకుని కాలంలో నిర్మించబడివుండాలి. 1572-75 లలో మధురనేలిన వీరప్పనాయకుని ప్రధానమంత్రి ఆర్యనాథ మొదలే ఈ మండపాన్ని నిర్మించాడని చెబుతారు. ఈయన విగ్రహం మండపద్వారానికి పశ్చిమంగా కనిపిస్తుంది ఇప్పటికీ నాటి స్మృతులను రేకెత్తిస్తూవుంటుంది. మిగిలినభాగాలలో చెక్క 1623-29 లలో తిరుమలనాయకుడు కట్టించివుండాలి. ఆలయం అన్నులన్ని తిరుమలనాయకుడుగాని - ఆయన తరువాతవారుగాని ఇచ్చివుండాలి.



తెప్పతిరునాళ్ళ జరిగే కొలను: మధ్య సుందరమైన దీవి. తిరుమలనాయక నిర్మితము.



వీణాపాణియైన రావణవాహనం. (కొన్నిలక్షల విలువ)

# శ్రీ మీనాక్షి సుందరేశ్వర్ దేవాలయం: మధుర.

## శిల్ప విస్ఫూర్తి

ప్రసిద్ధ ద్రావిడదేవాలయాల శిల్పకళావిశేషమే ఈ కోవెలలోకూడా మనకు కనిపిస్తుంది. నాలుగు పెద్దరాతిగోడలు - ప్రతీగోడమధ్య ఒకద్వారం, వాటిచుట్టూ పిరమిడ్లనుపోలిన చక్కని గోపురాలు- 850 అడుగుల నిడివి - 750 అడుగుల వెడల్పుగల చతురస్రాకారప్రాంతంలో నిర్మించబడివున్నది.



గోపురాలలోని క్రింది భాగంలో శిల్పం నగిషీగల రాళ్లు, పైభాగంలో హిందూపురాణగాథలలోని సంఘటనలను నిరూపించే రమణీయమైన చిత్తరువులు కానవస్తాయి ఇండియాలోని ఏ దేవాలయంగోపురాలు మీనాక్షీసుందరేశ్వర దేవాలయ గోపురాలంత ఉన్నతమైనవి కావేమో. గుడి దక్షిణగోపురం ఎత్తు 160 అడుగులు. ఇదే ఆలయం గోపురాలన్నిటిలోను ఎత్తైనది. యాత్రీకులు, దేవతాదర్శనాకాంక్షులైన భక్తులు సాధారణంగా ఆలయంలో దేవతవిగ్రహానికి అభిముఖంగావున్న తూర్పు గోపురంనుంచే ప్రవేశిస్తారు. మండపంలోని ఎనిమిది స్తంభాలపైన ఎనిమిదిదేవతా విగ్రహాలున్నందుననే దీనికి అష్టలక్ష్మీమండపమని పేరువచ్చింది. ఈహాలు దక్షిణ, ఉత్తరకుడ్యాలపై మీనాక్షీదేవిచరిత్ర ఉల్లేఖించబడివుంది. దీనిలోనుంచి, మరికొన్ని మండపాలనుంచిపోగా, స్వర్ణపద్మసరోవరం కనిపిస్తుంది.

ఈ కొలనుకు ఈ పేరురావడానికి స్థలపురాణంలో ఒకగాథవుంది ఈ ఆలయాన్ని నిర్మించిన తరువాత మీనాక్షీదేవిని కొలువనుద్దేశించి, ఇంద్రుడు పూలకోసం ఒకదూతను దేవలోకానికి పంపించాడు. ఈలోపుగా ఆలయంలోని కొలనులో ఒక తామరపువ్వు మెల్లిగా పైకిరావడాన్ని గమనించాడు. దానిని కోసి పూజచేశాడు.

ఈస్వర్ణపద్మసరోవరంలో ఒక్కసారి స్నానంచేసిన వారిపాపరాసులు పటాపంచలౌతవని చెబుతారు. మధురలోను, వెలుపల శివుడుచేసిన 64 అద్భుతాలు. ఆలయం తూర్పు, ఉత్తర కుడ్యాలపై వ్రాయబడియున్నాయి. ఆలయంలో శుకమందిరంవుంది. ఇక్కడ అనేకరకాల చిలుకలు కనిపిస్తాయి. మీనాక్షీదేవికి చిలుకలంటే తగనిమక్కువఅట. కనకనే ఈ మందిరంలో రకరకాల శుకాలను పెంచుతారు.

ఈ మందిరం దాటితే శ్రీ మీనాక్షీదేవి విగ్రహంగల గుడిలోనికివస్తాం.

ఇక్కడకు వుత్తరంగా సుందరేశ్వరుని కోవెలవుంది. సుందరేశ్వరుడు మహాసౌందర్య విలసితుడు. ఆయన గర్భగుడికి అభిముఖంగా ఒకే శిలాఖండంతో నిర్మించబడిన మండపం, నందివాహనం వున్నాయి.

ఈ మండపం శిల్పం నిజంగా మహాద్భుతమైనది. ఇది రమణీయ శిల్పకళావిలసితములైన ఎనిమిది స్తంభాలపై ఆధారపడివుంది. ఈ స్తంభాలపై చెక్కబడిన ప్రతివిగ్రహం, ఆ విగ్రహంలోని భావస్ఫూర్తి ప్రపంచంలో ఎక్కడా కానరాని అపరూప శిల్పకళావైభవాన్ని చాటుతాయి. ఈ మండపం వెలుపలనే కల్యాణ మండపం వివాహవేదిక వున్నాయి ప్రతిఏటా శ్రీ మీనాక్షీ సుందరేశ్వరులకల్యాణం ఇక్కడ మహావైభవోపేతంగా జరుపుతూ వుంటారు. స్వామిసన్నిధికి తూర్పుగావున్న సహస్రస్తంభ మండపంలో కూడా



అతిమనోజ్ఞమైన శిల్పం ద్యోతకమౌతుంది. దురదృష్టవశాత్తు ముస్లిం దండయాత్రలలో కొన్ని స్తంభాలు దెబ్బతిన్నవి. ఈ మండపంలోని శిల్పం అనన్య సామాన్యమైనదని ఫెర్గుసన్ తన రచనలో పేర్కొన్నాడు.

ప రి పా ల న

దేవాలయాల పరిపాలనాబాధ్యత ప్రభుత్వానిదే అని ఇండియాలో ఏనాడో గుర్తింపబడివుంది. హిందూ, ముస్లింరాజులు దేశాన్ని పరిపాలించినకాలంలో ఆలయాలపై మశీదులపై అజమాయిషీని ఆరాజులే చేస్తూయుండేవారు.

1623-59 ల మధ్య తిరుమలనాయకుడు మధురను పాలించినకాలంలో దుర్వ్యయానికి మధుర మీనాక్షి దేవాలయం మేనేజర్‌ను ఉద్యోగంనుంచి బర్తరఫ్‌చేసి, పరిస్థితి చక్కబడినట్లు తనకు నమ్మిక కలిగేవరకు ఆలయపరిపాలనాకార్య కలాపాలను తానే నిర్వహించాడని నెల్సన్ వ్రాసివున్నాడు.

1706-32 లలో మధురను పాలించిన విజయరంగ చొక్కనాథుడనే మరొక నాయకరాజు తన కాలాన్ని ముఖ్యంగా దేవాలయాభివృద్ధికే వినియోగించేవాడు. ఆరోజులలో మధురమీనాక్షి దేవాలయం, మధురకు 12 మైళ్లదూరంలోని శ్రీ కల్లాలగర్ దేవాలయం, తిరుప్పరన్‌కుంద్రం, తెంకాశా, తిరువేదగం కుర్విదురై ఆలయాలు హస్తాదేవస్థానం అనేపేరున సమిష్టిగా నిర్వహించబడేవి.

మధురపై చందాసాహెబ్ దండయాత్రజరిపినపుడు ఆలయానికిచెందిన ఆస్తినంతటిని తాను వశపరచు కొని, మేనేజరును దేవతావిగ్రహాలతో మానామదురైకు పారిపోవలసినదిగా నిర్బంధించాడు. చందా సాహెబ్‌ను మురారిరావు ఖైదిగాపట్టుకొన్నతర్వాత ఆవిగ్రహాలను తిరిగి మధురకు తెప్పించాడు యూసుఫ్ ఖాన్‌మధురకువచ్చినప్పుడు, ఈ ఏడుదేవాలయాల రక్షణపోషణాలకు మొదటిసంవత్సరం 12,000 చక్రాలు, ఆ తరువాత సంవత్సరాలలో 6,000 చక్రాలువంతున విరాళం మంజూరుచేశాడు. ఈ ఏడు ఆలయాల ఆస్తులమీద ఆదాయం ఆరోజులలో సాలినా 50,392 రూపాయలు.

1801 లో కర్నాటక నవాబు కర్ణాటకప్రాంతం పౌరసైనికపరిపాలనాధికారాలను శాశ్వతంగా ఈస్టిండియాకంపెనీవశంచేశాడు. ఈస్టిండియాకంపెనీ ఈఅధికారాన్ని దఖలుపరచుకొన్న తొలిరోజులలో ఈ ఆలయాల నిర్వహణను ముఖ్యకర్తవ్యాలలో ఒకటిగా భావించుకొన్నది

మధురకు అప్పట్లో నియమించబడిన కలెక్టరులలో ఒకడైన మిస్టర్ హర్డిస్ 27-1-1802 వ తేదిని ఒక నివేదికను వెలువరిస్తూ ఈవిధంగా అన్నాడు

"ముసల్మానులు దేశాన్ని బ్రిటిష్‌వారి పరంచేసినపుడు అవి అరాచకస్థితిలోనేవుంది, ఈ దేవాల యాలను ప్రభుత్వం తన అజమాయషీలో వుంచుకొని, కలెక్టరులద్వారా నిర్వహిస్తూవుండేది."

ఈ ఏడుదేవాలయాలకు సాలినా, 12,000 చక్రముల (నాణెము) నీయవలసినదిగా మిస్టర్ హర్డిస్‌ప్రభుత్వానికి సిఫారసుచేశాడు.

మధురలో అధికారం సాగించిన ఇతర కలెక్టరులుకూడా ఈఆలయాలపట్ల సానుభూతి భావాన్నే వెలిబుచ్చుతూ వుండేవారు. 1812 నుంచి 1828 వరకు కలెక్టరుగా వున్న రౌస్‌పీటర్ ఈ ఆలయాల నిర్వహణలో చూపినశ్రద్ధాసక్తులనుబట్టి, ప్రజలు ఆయనను పీటర్‌పాండ్యా అంటూ వుండేవారు. తనచే గాయపరచబడిన ఒకఏనుగు దెబ్బతియ్యకుండా తప్పించుకొన్న సందర్భంలో దేవతకు కృతజ్ఞతా సూచనగా ఇతడు రెండు బంగారపు "స్టిరప్స్"ల నిచ్చాడట.

1841 ప్రాంతంలో క్రైస్తవప్రభుత్వం హిందూదేవాలయాలను నిర్వహించరాదంటూ లేపిన ఆందోళన ఫలితంగా ప్రభుత్వం వీటి నిర్వహణాధికారాన్ని వ్యక్తుల, లేదా సంఘాలవశంచేసింది. ఈ పరిణామానికి ఫలితంగా 1842 లో ముత్తుచెలతేవార్ ఈఆలయానికి మొదటి మేనేజరుగా నియమించబడినాడు. 1863 లో జరిగిన 20 వ చట్టాన్నిబట్టి ఆలయాల నిర్వహణను పర్యవేక్షించడంకోసం, స్థానికసంస్థలను ఎన్నుకోదగు అవకాశంకలిగింది. 1864 లో అయిదుగురు ప్రముఖులుంగల ఒక కమిటీ ఏర్పడింది. ఈ చట్టాన్ని సవరణచెయ్యడానికి అనేకయత్నాలు జరిగినవి అవి తుదకు 1927 వ సంవత్సరపు హిందూ రెలిజియస్ ఎండోమెంట్ అక్టుగా రూపొందినవి ఇప్పుడు మీనాక్షీసుందరేశ్వర్ గుడి బోర్డువారు వేతనంపై నియమించిన ఒక ఉద్యోగి నిర్వహణాధికారానికి లోబడివుంది.

ఈ ఆలయానికి ఎన్నోచరిత్రాత్మక ప్రసిద్ధిపొందిన ఆభరణాలు, వస్తువాహనాలుకలవు. సాలీనా అయిదులక్షల రూపాయలు రాబడివచ్చే ఆస్తివుంది.

---

## —: దీపావళి :—



అదిపదునాల్గు లోకములనార్చెడి ఘోరనిశాచరాధ మా
ర్బుదశతకాంధకార హరణాక్షణ దివ్యశరాసన ప్రథన్
ముదితకరార్క దీప్తులు గుముల్కొనినట్టి పురాణకాల పు
ణ్యదినము-లోకసేవ్యము-జయప్రదమీ భరతావనిన్ సదా!

గరుడోరగ యక్షః కి
న్నర గంధర్వ సుపర్వులాది నాకాధీశుల్
కురియించిరి కుసుమవర్షము
పరమపవిత్రమ్ముగాదె భరతావనికిన్.

పాటల గంధికిన్ కదనభారముఁ గల్పనఁజేసి యింతమో
మాటముఁ జూపకుండ నభిమానము వీడి రథాంతరమ్మునన్
గాటపు మూర్ఛయన్ నటనఁ గాలము బుచ్చినయట్టి యాజగ
న్నాటక సూత్రధారి కరుణారసమొల్కఁగనవ్వె; స్వల్పమే!

వారకభామి నీ గణమవారితలీల విభూషరత్నను
శ్రీ రమణీయతారుణ విశేషవిలాస వినూత్న కాంతు లా
యారమణీయ దీపికల కందముఁగూర్పగ దివ్యగీతికా
హారతులిచ్చిరంత వివిధార్థ రసోచిత నాట్యభంగిమన్.

పరమపావన దివ్యశుభప్రదమ్ము
భవ్యజన సేవ్యమైన దీపావళీ శు
భోదయమ్ము; సౌభాగ్యభానూదయమ్ము;
ఆంధ్రతేజఃప్రభావమ్ము "దీపాళి" సుమ్ము.

— పా. వే. న. శర్మ.

# సామెతలు

311. అల్లుడొచ్చేవరకు అమావాశ్యఅగుతుందా !
312. అత్తకొకరోగం మామకొకరోగం;
అడ్డెడుతప్పేలాకు ఏరోగంలేదు.

313. అర్థం ప్రాణం ఆచార్యాధీనం, తాళం
చేతులు తన అధీనం.

314 దగ్గితే ఉండనిముక్కు తుమ్మితే ఉంటుందా.
315. ఏపాటుతప్పినా సాపాటుతప్పదు.
316. ప్రయాణాలు అబద్ధం, ప్రసాదాలునిబద్ధి.
317. మనసా మామగారి తద్దినమా
318. పొరుగింటి కయ్యం వినవేడుక.
319. పొరుగింటి పుల్లకూర రుచి.
320. పొరుగింటిఅట్లకు వెన్నకాచుకొన్నట్లు.
321. తాటాకుచప్పుళ్ళకు కుందేలుబెదురుతుందా.
322. వేడినీళ్లతో యిల్లుకాలునా
323. కన్నమ్మకేవాపు; తిన్నమ్మకేతీపు.
324. అయ్యకువిద్యలేదు, అమ్మకుగర్వంలేదు.
325 అయ్యవారినిచెయ్యబోతే కోతి అయిందీ
326. గురువుగారు ఏంచేస్తున్నారంటే చేసినతప్పులు
దిద్దుకొంటున్నారు.

327. అమ్మదగ్గఱ క్రిందపడుకొన్నా, అయ్యదగ్గఱ
పైన పడుకొన్నా ఒకటే.

328. బ్రతికిన బ్రతుకుకు భగవద్గీతపారాయణమా !
329. అమ్మపెట్టాపెట్టదు, అడుక్కొనితినానివ్వదు.
330. దినం మంచిదని తెల్లవార్లు దొంగిలాడట.
331. రంగడికి, లింగడికి స్నేహమేకాని రొట్టె
దగ్గర గిజగిజా.

332. చదువుకున్న అతనికన్న చాకలిమేలు.
333. సింగడు అద్దంకిపోనూ పోయినాడు రానూ
వచ్చాడు.

334. ముండచేతిబిడ్డ, ముక్కుతాడులేనిఎద్దు ఒకటే.
335. బ్రతుకనిబిడ్డ బారెడు.
336. ఆడలేనిబోగంది మద్దెలపైబడ్డట్లు.
337. సమ్ముఖములో రాయబారంజరిపినట్లు.
338. తాటాకుచప్పుళ్లకు కుందేళ్లు అడిలినట్లు.
339. తానుపోతే తోడులేదు, రాయరా
సన్న బియ్యానికి చీటి.

340. మనివున్నవాడు మణిగలేదు, ఒలికిలోకి
పాడి ఆవు.

341. పోగాకుఅడుక్కోవాలి, అందలంబైటపెట్టరా.
342. నియోగ్యంముష్టికి, బనారసుసంచి.
343. శనగపప్పుఊరికేవస్తే మావాడుమరోడు
వున్నాడు, కొనేటట్లయితే నాకూ కడుపులో
నొప్పే.

344. పిల్లపోతేపోయింది, భారసాలబాగాచెయ్యి.
345. చస్తేచచ్చాడు, గాని జ్వరం చప్పునజారింది.
346. పెచ్చులకువేటపాలెంపోతే, తన్ని తలగుడ్డ
లాక్కున్నారు.

347. మింగటానికి మెతుకులేదు, మీసాలకు
సంపెంగనూనె.

348. అయిరానికాలంలో పైగుడ్డ పక్షి ఎత్తుకు
పోయింది.

349. అభావోవిరక్తి, దరిద్రశ్చూ దైవభక్తి.
350. ప్రజలకు పెద్దబావ చస్తే, ఈడవలేక ఇంటిల్లి
పాది చచ్చారు.

351. ఇంటింట వకపొయ్యిఅయితే, మా ఇంట
మరో పొయ్యి.

352. అలవాటులేని ఔపోసన చేస్తే, మూతి
మీసాలు తెగకాలినై.

353. మొక్కైవంగనిదే, మానైవంగుతుందా.
354. చుట్టమైచూడొచ్చి, దయ్యమైపట్టాడు.
355. నీచేతిమాత్ర, వైకుంఠయాత్ర.
356. సదాకోటి దరిద్రాలకు, అనంతకోటి
ఉపాయాలు.

357. పడమటివీధమ్మ పట్టెడపెట్టుకుంటే
ఉత్తరపు వీధమ్మ ఉరిపెట్టుకున్నది.

# కవయిత్రి సమ్రాజ్ఞిదేవి, తిరుమలాంబ

శ్రీ రాంపల్లి శ్రీరామచంద్రమూర్తిగారు



( మూలము సంస్కృతమ్ పం. శ్రీనివాసాచార్యులుగారు స్వేచ్ఛానువాదము)

రత్నగర్భయు జగజ్జేగీయమానయు నైన భరతభూమి మిక్కిలి పవిత్రమైనది. భారతదేశమున వేదకాలమునుండియు స్త్రీలుకూడ సులలిత గద్య పద్యరచనా చతురలై గీర్వాణభాషాసేవారతలై పండితులతో వాగ్వాదముచేయు నేర్పుకల వారై యుండెడివారు. అందునను దక్షిణభారత దేశమున, నెల్లదేశములకు కర్ణావతంసమై కర్ణాటదేశము సుప్రసిద్ధమైయున్నది. ఇక్కడి పురుషులేకాక గృహలక్ష్ములును, వైదుష్యమునను, వైభవమునను, శౌర్యమునను, ధైర్యమునను, వీర్యమునను, పరాక్రమునను, రసికతయందును, ఔదార్యమందునను, సౌహార్దమునను, అతిథిపూజా తత్పరతయందును, వచోమాధుర్యమునను, సౌందర్యమునను, ఉదారతాది సద్గుణగణామునను అసమానలై సాటిలేని మేటి కీర్తియార్జించి యున్నారు.

వారి యందఱిలోను సుప్రసిద్ధయగుదేవి, తిరుమలాంబ, యత్యంత రసవంతమగు కావ్యరత్నములను లిఖించి కర్ణాటదేశమునకాచంద్రార్కమగు కీర్తినార్జించినది. అట్టి యీమె నామమును కర్ణాటులుకూడ యెఱుగకపోవుట దేశదౌర్భాగ్యమే. హారదయాల మహాశయుడు కర్ణాటమందలి "ఐహోలీ" యను సుప్రసిద్ధ స్థలమునకువచ్చి అక్కడి దేవాలయములను అక్కడి శిల్పచాతురినిచూచి పరమానందభరితుడై యానందబాష్ప పూర్ణనేత్రుడయ్యెనట.

ఇక తిరుమలాంబ యెవరో, యామె యెక్కడ వసించినదో తెలియుటమనకు ముఖ్యము. కర్ణాటమున విజయనగర సామ్రాజ్యము చరిత్రప్రసిద్ధమైనదను విషయ మందఱు నెఱిగినదే. ప్రజాహితైక తత్పరులగు నరపాలురీ సామ్రాజ్యమేలిరి. అట్టి మహారాజులలో, సుప్రసిద్ధుడగు నచ్యుతదేవరాయలొకడు. అచ్యుత దేవరాయల పట్టమహిషి కవయిత్రియగు నీ తిరుమలాంబయే. తిరుమలాంబ విదుషీమణియై వివిధ శాస్త్రపారంగతులగు విద్వాంసులను పోషించెడిది. అనేక మనోహరకావ్యముల నీమె రచించినట్లు తెలియుచున్నది. కాని యవియన్నియు దేశదౌర్భాగ్యముచే జాతీయవిద్య వలెనే నశించినవి. ప్రాచ్యగ్రంథాలయాదులను శోధించు విద్వజ్జనుల నీ తిరుమలాంబ రచించిన గ్రంథరత్నములకై తగుశ్రద్ధ వహింప ప్రార్థించుచున్నాను.

"ఆక్స్‌ఫర్డ్" విశ్వవిద్యాలయమున సంస్కృత విభాగాధ్యక్షులగు డి. యల్. ఎం. ఏ. లక్ష్మణస్వామి మహాశయులు, దక్షిణహిందూస్థానమునకు వచ్చినప్పుడు తంజావూరు పురమందలి ప్రాచ్యలిఖిత గ్రంథసంగ్రహాలయమున "వరదాంబికాపరిణయము" అను ఒక హస్తలిఖితమగు జీర్ణగ్రంథమునుచూచి నాగరలిపిలోనికి పరివర్తనము చేయించిరి. దీనిని విజయనగరపాలకుడగు నచ్యుతదేవరాయల పట్టమహిషియైన తిరుమలాంబయే రచించినది. కథానాయికగా యిందభివర్ణింపబడిన "వరదాంబ" భర్త, విజయనగరపాలకుడగు నచ్యుత దేవరాయలే; అనగా యీమె తన చరిత్రమునే యిందభివర్ణించుకొనినది. తన పేరు "వరదాంబ" యని మార్చుకొనినది.

ఈ గ్రంథమున చంద్రుడు మొదలుకొని నృసింహదేవరాయలవరకు వర్ణించి యతని కుమారుడును తనకు పతియునైన యచ్యుతదేవరాయలను వర్ణించినది. పిదప సుతోత్పత్తి, కుమారునకు యౌవరాజ్యాభిషేకమువర్ణించి గ్రంథము ముగించినది. అయితే యచ్యుత దేవరాయల సోదరుడును జగత్ప్రసిద్ధుడునునగు కృష్ణదేవరాయలపేరైన యెత్తకుండుట యాశ్చర్యము. కృష్ణదేవరాయల తరువాతనే యచ్యుతదేవరాయలు రాజ్యముపొందుట చరిత్రమున రూఢియైయున్నది. శ్రీకృష్ణదేవరాయలపేరైన యెత్తకుండుటకుగల కారణముల విచారించు భారము చరిత్రశోధకులపై నిడుచున్నాము. తిరుమలాంబయే "వరదాంబిక" యనియు కథానాయకుడే విజయనగర పాలకుడగు నచ్యుతదేవరాయలనియు నున్న మా యభిప్రాయము సరియైనది కాదనుచో సప్రమాణముగ యథార్థము నెవరైన నిరూపించుచో నానందముతో నంగీకరింతుము.

యీ గ్రంథము కాశీలో గవర్నమెంటుసంస్కృతకాలేజీలో పాఠ్యగ్రంథముగ నుండెడిదట.

ఈమె కవనమందలి సులలితపద విన్యాసకళాకౌశలము చూపుటకై క్రిందిశ్లోకము నుదాహరించుచు నీ వ్యాసము ముగించుచున్నాడను.

విలస దలస చారై ర్విస్మయ స్మేరతారైః
ప్రణయరసగభీరైః ప్రాంతవిస్తారశారైః
వరతనురవదాతై ర్వంచితాసీత్ససీతైః
ప్రసవవిశిఖదూతైః పార్థివస్యాక్షిపాతైః.

# రీటా తల వెండ్రుకలను పెంచును



రీటా కుదుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటి వెండ్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తలవెండ్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు ఇంకను తలవెండ్రుకలకు సంబంధించిన సమస్తవ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేనకువేలు వాడి గుణమును పొందియున్నారు. మీరుకూడా నేటినుండియే రీటా వాడుడు.

రీటా ప్రతిచోటా దొరకును. వెల సీసా 15 అణాలు.

## హిందీ, ఆంధ్ర, తమిళ, కన్నడ తారల ప్రశంసలు

**లలితాపావర్ :** ఉత్తమమైన హెయిర్‌టానిక్ కోరేవారికి రీటాకు మించినది మరేదీలేదు. దానిని వాడితే వారు మనమాతృభూమి అనేక శ్రేష్ఠమైన వస్తువులను ఉత్పత్తి చేయగలదని గ్రహించుకోగలుగుతారు.

**సుశీల్‌కుమార్ :** రీటా శిరోజాల వృద్ధికి మిక్కిలి సంతృప్తికరమైన సాధనం. శిరోజాలు రాలిపోతున్నపుడు నివారణకు, బుద్ధినైర్మల్యానికి ఎల్లరూ ఎప్పుడూ రీటానే వాడాలని సిఫారసు చేస్తున్నాను.

**కన్నాంబ :** రీటా నాకు పరిపూర్ణమైన తృప్తికలిగించినదని తెలుపుటకు మిక్కిలి సంతోషముగానున్నది. అది నిజముగా అమోఘమైనది.

**పుష్పవల్లి :** నాకు సుమారు ఏడాదిగా తలవెంట్రుకలు రాలిపోతున్నవి. రీటా వాడినప్పటినుండియు, తలవెంట్రుకలు రాలుట తగ్గింది. ఇది చాల శ్రేష్టమైన హెయిర్‌టానిక్ అని నా అభిప్రాయము.

**సూర్యకుమారి:** రీటా మంచి సువాసనకలిగి, వాడినవారికి ఎంతో చల్లదనము చేకూర్చును. ఇకమీదట ఎల్లప్పుడు రీటానే వాడవలయునని నేను ఒక నిశ్చయమునకు వచ్చితిని.

**కృష్ణవేణి.** రీటా చక్కని సువాసనగలిగి, మనస్సునకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది తలవెంట్రుకలను రాలకుండాచేసి, కొత్త వెంట్రుకలను పెంచుటకు రీటా సాటిలేని హెయిర్ టానిక్.

**ఆర్. పద్మ:** నా ముఖసౌందర్యమును పెంపొందించే శిరోజాలకు రీటాయే కారణము. స్వల్పకాలములోనే రీటా అద్భుతముగ గుణము నిచ్చినది.

**లక్ష్మిబాయి:** తలవెండ్రుకలను పెంచుటకు రీటా అమోఘముగ పనిచేసినది.

**వసుంధరాదేవి:** శిరోజాలు దీర్ఘంగా నిగనిగలాడుతూ ఎదగడానికి, శిరోజ రక్షణకు రీటా అమోఘమైనదిగ రుజూవైనది.

**రాజమ్మ :** శిరోజ సంబంధమైన బాధల నివారణకు రీటా అమోఘమైనది. గుర్తించుచున్నాను. శిరోజవృద్ధికి, రక్షణకు ముఖ్యమైన వస్తువులు రీటాలోవున్నవి. దీర్ఘవినీలకుంతలాలు ఆశించే మహిళలందరూ దీనినే వాడాలి.

# రీటా హెయిర్ టానిక్

# సోదో యమ్మ సోది

కనుపర్తి వరలక్ష్మమ్మగారు

సోదో యమ్మ సోది, సోదీ! ఎఱుకో! సోదడుగుతారమ్మ సోది. (అంటూ ఒక స్త్రీ సోదిబుట్ట నెత్తిని పెట్టుకొని వస్తుంది)

ఒక స్త్రీ (లోపలనుండివచ్చి) ఓఅమ్మో! సోదమ్మో! యిట్లా రా?

సోదికత్తె:-(వచ్చి) ఏం దొరసానమ్మా! సోదడుగుతావటమ్మా!

స్త్రీ:-అడుగుతాను ఏం సోదిచెప్తావు?

సో:-ఏంసోదిచెప్తానమ్మా నీ సోదే, నీకుచెప్తాను.

స్త్రీ:-నా సోదంటే?

సో:-నీ సోది. నీ వాళ్లసోది.

స్త్రీ:-నావాళ్ల సోదేమిటమ్మో?

సో:-నీవాడకూతురివి కాదంటమ్మా?

స్త్రీ:-అవును.

సో:-మరి ఆడోరి సోదే చెప్తాను.

స్త్రీ:-మరి, ఆడోరిసోదిఒకటీ, మగోరిసోది ఒకటీనా?

సో:-మఱి అంతే, ఎవరిసోది వారిదే.

స్త్రీ:-అయితే యేమివ్వాలె.

సో:-ఏమిస్తావు? పరాలిస్తవా? మూడలిస్తవా? నలుగురితో పాటియ్యి.

స్త్రీ:-నలుగురూ ఏమిచ్చారనే నేనడిగేది? అసలు ఈ వూళ్లో ఎవరికైనా చెప్పావా?

సో:-చెప్పకేమమ్మో, ఎవరికీ చెప్పకుండా తొలింగా నీ యింటికే గద్దెపట్టుకొని వచ్చాననుకున్నావా? అల్లదుగో ఆగుడికాడ బాపనమ్మోరికి సెప్పినా, ఇల్లిదిగో ఈ సందులో సెట్టిగారి పెండ్లానికి సెప్పినా, అల్లదుగో ఆ తెలగాల అమ్మాయికి సెప్పినా, అద్దదుగో ఆకునికాడ చౌదరీగారి జేజమ్మకు సెప్పినా, అదిగో ఆ ఈదిన మొలుగుడిడిసి నామెకు సెప్పినా, ఓ అల్లక్కడ దెయ్యంపట్టినామెకు సెప్పినా, ఓయెంతమందికో సెప్పినా.

స్త్రీ:-సరే ఏమియ్యాలో చెప్పు నేనూ సోదిఅడుగుతా

సో:-తవ్వెడు గిద్దెడు బియ్యం; పావలా రొక్కం మామూలేగా.

స్త్రీ:-అమ్మో! (గుండెకొట్టుకొని) తవ్వెడు గిద్దెడు బియ్యమే, మూడురోజుల శేషనింగు పోతుంది, తర్వాత ఏమితింటాం?

సో:-పోనీలె; అట్లాకాకపోతె అరసోలెడు బియ్యమే యిచ్చి రూపాయి రొక్కమియ్యి.

స్త్రీ:-అబ్బో! నీరేటు చాలా జాస్తిగాఉన్నదే!

సో:-అన్నిటికి పెరగలా? రూపాయిస్తే ఏమివస్తుంది.

స్త్రీ:-సరే కూర్చో! (అని లోపలికిపోయి రూపాయి కాగితము అరసోలెడు బియ్యము) చేటలో పెట్టుకొని వస్తుంది.

సో:-ఏందమ్మో! రూపాయికాగితం తెచ్చావు, చేతిలో మాసిపోతది, చమటకు నానిపోతది, ఊరుపట్టుకు తిరిగేవోళ్లం; యాడ పెట్టుకుంటాము. రూపాయిబిళ్ల తీసుకరాఅమ్మా.

స్త్రీ:-సరే నీతో అన్నీ తంటేనే. రూపాయిలేదు, చిల్లర తేవచ్చునా?

సో:-అ మారాజులాగా తీసుకరా, నాకేమీ, కాగితం మాసిపోతే కోమటాయన తీసుకోడని సెప్పినా.

స్త్రీ:-(లోపలికిపోయి డబ్బులుతీసుకవచ్చి చేటలో పెట్టి సోదికత్తె కెదురుగా కూర్చుంటుంది)

సో:-ఓ కొల్లాపురి అంకమ్మా! బెజవాడ కనకదురగమ్మా! ఈతముక్కల జాలమ్మా! చందలూరి మాలచ్చమ్మా! ఏడుకొండలవాడ యెంకటేశరుడా! సీశైల మల్లికార్జునుడా! మంగళాద్రి

వారసింమ్మా! గుంటూరు మస్తానయ్యా! తిరుపతమ్మా! చామాలమ్మా! ముత్యాలమ్మా! నూకాలమ్మా మొదలైన నూటొక్క సత్తైమైన దేవుళ్లారా! పలికి బొంకవద్దు, ఆడితప్పవద్దు ఉండదున్నట్టు లేనిది లేనట్టు సెప్పరేఅమ్మా! నీవు దయ్యానివిగాదు, బూతానివిగాదు, పీడవుగాదు, పిశాచివిగాదే అమ్మా!

స్త్రీ:-అయితే ఎవరు?

సో:-సత్తైమైనతల్లివే అమ్మా! చదువులమ్మ నీవేనే అమ్మ! సంపదమ్మవు నీవేనేఅమ్మ! ఇందరి అమి శానబుట్టి ఏమీలేకుండ ఉన్నవేఅమ్మా! ఈనాటి దానివి కావేఅమ్మా!

స్త్రీ:-మరి ఏనాటిదాన్నంటావు?

సో:-ఓ నాల్గుయుగాలను ముందుదానవేఅమ్మా! వేద కాలంలో నీ పబయెలిగిపోయిందేఅమ్మా! రాచ సభల్లో చరచలే చేవు, రుసులనే ఓడించావు, ప్రజలనే మెప్పించావేఅమ్మా! నీ సత్యాలలో నీ మగిమలలో దేవతలనే సై అనిపించావేతల్లీ! కాలశక్రమే కట్టేశావేతల్లి! సూర్యచంద్రులనే నిలిపేశావెతల్లి! పగలురేతురులే ఆపినావెతల్లీ! తిరుమూరుతులె కసికందులైనారేతల్లీ! మనసూ, వాకూ, సేతా ఒకటిసేసుకొని యముడినే గెలిశావే తల్లీ! సచ్చిన మగణ్ణి బతికించుకొన్న సత్తైమంతురాలివేతల్లి! మానమంటె లెక్కసేయవే తల్లి! మానం పోతదంటె మంటలోపడి మగ్గిపోతవేతల్లి! రణాలేసేశావు, రాజ్యాలేఏలావు, తీరుపులే దిద్దావు, నీవెరుగని దరమాలు, నీవెరుగని న్యాయాలు లేవేఅమ్మా!

లోకమంతా నీ సత్తైంమందు చిత్తైందేఅమ్మా. జగమంతా నీకు తలవొగ్గిందే అమ్మా. తెల్లమొగాలోళ్లు బుట్టటోపీలవాళ్లు నీ పగ్గనూసి విస్తుపోయినరే తల్లీ!

స్త్రీ:-అంతా వెనుకటి గొప్పే చెప్పతున్నావు! ఇప్పుడుమాత్రం విస్తుపోవడంలేదా?

సో:-ఇప్పుడేమిపోతకే అమ్మా!

స్త్రీ:-ఏమి?

సో:-యెనకటి సత్తా యిప్పుడేదజే అమ్మా!

స్త్రీ:-ఏమైపోయింది.

సో:-ఏమైందంటవేమే అమ్మా! అనుభవిస్తూ మరిసిపోతవేమే అమ్మా! కూటికి గుడ్డకు దేబిరిస్తుండవు గదేఅమ్మా! మాటకూ మంతికి నోసుకోక పోతివి గదేఅమ్మా! బానిస బతుకు బతుకుతుండవుగదే అమ్మా! సదువా, సొయిత్యమూఅన్నీ మానిపించిరి గదేఅమ్మా!

స్త్రీ:-ఎవరు మానిపించారు?

సో:-ఓ! ఎరగవంటే అమ్మా (అని ఫుల్లతో గడ్డం చూపిస్తుంది)

స్త్రీ:-గడ్డంచూపిస్తే?

సో:-అన్నీ యిడమర్చి సెప్పాల అమ్మకి (గడ్డం చూపిస్తూ) గడ్డమంటే పురుసుడూ, స్త్రీ అంటె (బొట్టుచూపిస్తూ) బొట్టూ కాదంటేఅమ్మా! (అంటూ మళ్లీ గడ్డంచూపిస్తుంది)

స్త్రీ:-అయితే యిక బాగుపడేమార్గంలేదా?

సో:-ఏమిమార్గం ఉన్నదంటవేఅమ్మా! పిల్లిగడ్డపోళ్ల కాలంలో నీ బతుకు పిల్లిమొగ్గేసిందేఅమ్మా! పాడుబావిలో పడిపోయినవేఅమ్మా! అంధకారంలో అణిగిపోయినవేఅమ్మా! వెలుగునూపినా వెలికి రాలేకపోయినావే అమ్మా!

స్త్రీ:-అయితే ఇప్పుడు బాగుపడకూడదా?

సో:-ఏం బాగుపడతవే తల్లీ! ఈ నాగరీకం, ఈసోకు నీకు ఎక్కువైందే తల్లే! (అని వీపు చూపిస్తుంది.

స్త్రీ:-వీపు చూపిస్తే?

సో:-ఓయమ్మ ఈమాత్రం తెలుసుకోలేవంటెఅమ్మా వెన్నంటే పడమటా గుండెఅంటే తూరుపు కాదంటేఅమ్మా!

స్త్రీ - పడమటి నాగరీకం ఎక్కువైందంటావా ?

సో - అంతు లేం అనుకున్నావు. పడమటోళ్ల పందా పట్టావు, తూరుపు వెలుగులు సూడమరిశావు, పల్లెపట్టులు వదలిపెట్టావు, బస్తీమోజుల కెగబడ్డావు, సీమసోకులు సేత్తానంటవు, సిలుకుశీరెలు కడ్తానంటవు. సినిమాలకు పోతానంటవు, కాపీనీల్లు తాగుతనంటవు, కల్లల్లో పౌనాలు నిలుపుతనంటవు, నీబలమూ నీశగితీ మరిసిపోయినావేఅమ్మా! కాయకష్టం మానావే అమ్మా! సోమారిసోకులు మరిగేవే అమ్మా! ఇంకా పాడుగాక ఏమవుతవే అమ్మా! నీమేలు సూశేవోరూ! నీకట్టం విశారించేవోరూ లేరెఅమ్మా! నీకునీవే విశారించుకోవాలే అమ్మా!

స్త్రీ - ఎట్లావిచారించుకోవాలె ?

సో :- ఎట్లాగంటవేమే అమ్మా! నీ మంచి సూడడానికి సంగముండది కాదంటె అమ్మా!

స్త్రీ - ఏమి సంఘం మహిళాసంఘమా !

సో అద్గదేనే తల్లే! అందులో సేరవే థల్లే! అదే నీ మేలుసూత్తదే థల్లీ! నీ మంచికోరతదే థల్లీ!

స్త్రీ - అది ఎక్కడో ఉంటే మాకేమి అందుబాటు ?

సో :- అందుబాటులేకేమే అమ్మా! నీవు యాడనుంటే అడకే వస్తుందే అమ్మా!

స్త్రీ :- వస్తుందీ ?

సో :- తప్పకుండా వత్తదే తల్లీ! నీవు యాడకూ పోవద్దే తల్లి! నీయిల్లు వాకిలీ, నీగొడ్డూగోద, నీపిల్లాజెల్లా సూసుకుంటూ, కదురూ కవ్వమూ తిప్పుకుంటూ, నీపాదులోనే నీవు ఉండవేఅమ్మా! జాతిద్వేసం జన్మద్వేసం నేర్చుకోకే అమ్మా! వరగబేదాలు, వరణబేదాలు పెట్టుకోకే అమ్మా! చీలికలు పేలికలు సేసుకోకే అమ్మా! పుంజాలతో పోరు పెట్టుకోకే అమ్మా! పెట్టలందర్నీ కూడగట్టుకోవే అమ్మా! సంఘమంతా ఒక్కటై, ఒక్కమాటమీద నిలిసి ఒక్కబాటమీద నడిసి పెద్దమనిసనిపించుకోనే తెన్నుసూసుకోవే తల్లీ! పెద్దలపేరు నిలపవే తల్లి! లోకమంతా నీదిగ సూసుకోవే తల్లే! లోకులంతా నీవారుగ ఎంచుకోవే తల్లే! నీకు కావలసినవన్నీ అవే వత్తవే థల్లే!

స్త్రీ - అయితే అ సంఘానికేమైన యివ్వాలా ?

సో :- ఏమిత్తవు? వరాలిత్తవా ? రూపాయిలిత్తవా ? అరదలిత్తవా ? సాలుకో పావలాయిచ్చి, సంఘంలో సేరవే తల్లీ! వేయి వరాల లాబం పొందుతవేఅమ్మా! కట్టాలన్నీ తుప్పున దూలిపోతాయే అమ్మా! సౌక్యంగా ఉంటవేఅమ్మా, (అని బియ్యం తట్టలో పోసుకుంటూ) ఓ అమ్మ! ఆకలవుతున్నది, ఓముద్ద అన్నముంటే పెట్టమ్మా! నీవు కట్టిడిసిన కోత్తకోకుంటె యియ్యిథల్లే! నీసెమటను మాసిన సిల్కురెవికుంటే పారేయమ్మా! మా బుడ్డోడికో చొక్కాయియ్యమ్మా! నీకు పుణ్యముంటది నీపేరు సెప్పుకుంటా థల్లే!





# ధ్రువజ్యోతి



శ్రీ నిర్వికల్పానందస్వామిగారు

అంధకారావృతం అయిన గదిలోకి మనుష్యుడు ప్రవేశిస్తే, ఎక్కడేముందో తెలియక తారాడ్తాడు. ఎదురుగుండా ఉన్నదేదైనా తగిలిపడిపోయినా పడిపోవచ్చు. కాని, అక్కడ కాంతి ప్రసరించిన పక్షంలో ఏవస్తువెక్కడ ఉందో విశదంగా తెలిసికోవచ్చు.

మనలో చాలామందియొక్క జీవితం, అనుశీలించిచూస్తే పైనచెప్పిన చీకటిగదిలో ఉన్నట్టే ఉంటుంది. సంభవించే దుఃఖకష్టాలు, తగిలేగాయాలూ, ఆవరించే చికాకులు ఎక్కడనుంచి వచ్చిపడ్తున్నాయో తెలీదు. కారణం గుహ్యం. అందువల్ల దాన్ని సరిచేసుకొందామన్నా వీలుపడదు.

జ్ఞానజ్యోతిప్రసరిస్తే ఈ అజ్ఞానమూ కలతా తేలిపోతాయి. కష్టాలు తొలగుతాయి. మానవుడు హాసన్ముఖంతో ఎక్కడా దెబ్బతినకుండా నడవగలడు.

ఇప్పుడు మనజీవనం ఉన్నపరిస్థితికి మన చింతాచర్యలేకారణం. సుఖాన్ని అనుభవిస్తున్నా, దుఃఖాన్ని పొందుతున్నా, దుర్బలులమైఉన్నా, శక్తివంతులమైఉన్నా, దుష్కృతులమైనా, సుకృతులమైనా, విజ్ఞులమైనా, వెకిలివాళ్లమైనా మనమనస్సేకారణం. అది ఏముఖంగా ఉంటే, ఆరీతి ప్రతిఫలిస్తుంది. జీవితంలో 'మతివలెనే గతి.' బుద్ధుడు 'మనోపూర్ణంగమా' అని అన్నాడు.

ఒకడు దుఃఖదశలో ఉన్నాడంటే, ఆ ఉన్నమనస్సు అతనిదే. అతనిలోనే అది పరిఢవిల్లింది. ఆస్థితి బయటఉన్న కొన్ని అంశాలకు ప్రతిక్రియాశీలం కావచ్చు, కాని కారణం అంతరంగంలోనేఉంది. బయటఉన్న పరిస్థితులు కావు. 'సహితం గుహాయాం.' ఒకడికి ఇచ్ఛాశక్తి పాలుతక్కువగా ఉందిఅంటే, ఆస్థితి అతడు కోరితెచ్చుకొందే కాబట్టి ఆడిగ్రీలోనే ఉంటున్నాడు ఆలోచల్నీ క్రియల్నీ ఆపరిధిలోనే ఉండనిస్తున్నాడు.

ఒకడు 'నేనుపాపిని' అని అనుకుంటున్న పక్షంలో కారణం ఏమిటి? అతడు పాపం చెయ్యబట్టే కదా! ఇంకా చేస్తూఉండటమే కదా! ఇంకోడు మూర్ఖుడు అవటానికూడా, కారణం అతడు మూర్ఖపు పనులు చేస్తూ ఉండటమే.

భావన చర్య:—ఈ రెండే మనిషికి ప్రాణం. అతనికి శరీరాన్నీ జీవితాన్నీ ఇచ్చేవి ఇవే. ఇవేరీతిగా ఉంటే, మనిషీ అల్లాగేఉంటాడు. ఇవి మారితే మనిషీమార్తాడు. భగవంతుడు ఇచ్ఛాశక్తిని ప్రసాదించాడు. కాబట్టి, మనుష్యుడు తన్నుమార్చుకోవచ్చు. కర్మకారుడు కాష్ఠఖండాన్ని సుందరమైన వస్తువుగా మారుస్తున్నట్టు, ప్రమాదపతితుడైన మనుష్యుడుకూడా తన్ను విజ్ఞానిగా సత్యప్రియునిగా మార్చుకోవచ్చు. బిల్వమంగలుడు, వేమన, తులసీదాసు మొదలైన వారెందరో ఉదాహరించవచ్చు

ప్రతివాడూ తనచర్యలకూ, తనచింతలకూ, తన మనఃస్థితికీ, తనజీవితక్రమానికీ తానే బాధ్యుడు. ఎట్లాంటి శక్తీ, విషయమూ, ఘటనా మనిషిని క్రుంగదీసి చెడుగును చేయించలేవు, దుఃఖాన్ని పొందచెయ్యలేవు. ఇట్లాపోతే మనిషి పరవశుడయ్యేది తనకుతానే, కూర్చొని చింతించేదీ తానే, చేసేదీ తానే. ఎంతటి శక్తిమంతుడైనా సరే, విజ్ఞాని అయినా సరే, మనిషిని మంచివాడుగా చెయ్యలేడు. సౌఖ్యాన్ని ప్రసాదింపలేడు, ఆశక్తి ఎంత పరమమైన శక్తైనాకానీ. మనిషి తనకు తానే సుఖాన్ని వరించి, సౌఖ్యాన్ని పొందాలి. 'యమైవేషవృణుతే' అని ఉపనిషత్తు.

కనుకనే, కావాలనుకొన్నప్పుడు మనిషికి మంచీ, సత్యం దొరుకుతాయి. వీటియొక్క ఆనందాన్నీ శాంతినీ, అతను అనుభవించగలడు. సత్సంగంలో ఈ రెండిటినీ అతడు పొందటానికి కారణం ఇదే స్వర్గద్వారాలు అందరికోసం తెరవబడే ఉన్నాయి అనధికృతులు ఎవ్వరూ లేరు, నరకద్వారాల్ని పట్టుకొని వ్రేళ్లాడువాళ్లు తప్ప.

అసామాన్యమైన జీవనపంథ ఒకటిఉంది. ఉన్నతమూ, విశాలమూ, ఆరోగ్యోచితమూఅయిన దివ్యజీవనం అది. ఇది ఎక్కడో పరలోకంలో లేదు. 'ఇహైవ.' ఈమార్గాన్ననుసరిస్తే, జీవితపద్మం వికసిస్తుంది. అనుసరించినవాడుచుట్టూ ఎంతకల్లోలంగా ఉన్నా, తానుమటుకు నిశ్చలంగాఉంటాడు మనోనిశ్చలతలేని వాళ్లమధ్య స్థితప్రజ్ఞతతో ఉంటాడు. కలహం మధ్య శాంతుడుగాఉంటాడు. మృత్యువే వచ్చినా ప్రశాంతత అతన్నివీడదు. శత్రువులు వెన్నాడినా, అతని హృదయంలో కరుకుతనం ప్రవేశించలేదు. స్నేహమాధుర్యాలతో అతనిహృదయంనిండి తొణికిసలాడ్తూఉంటుంది. సౌందర్యమార్దవాకరమైన ఆజీవితపథంలోంచి పాపం, దుఃఖమూ, హృదయవేదనా, నయనబాష్పాలూ తొలగిపోయాయి!!

ఈ విజయం నిమ్న జీవనస్తరంలో ఉన్నవాళ్లకు రమ్మంటేరాదు, దీనికోసం తపించి, పొందుదామనే కృతనిశ్చయత ఉన్నవాళ్లకే వస్తుంది. లోభికి బంగారంమీదఉండే మక్కువ ధర్మాచరణ మీదఉండాలి.

ఇది అందరికీ సమీపంలోనేఉంది అందరికీ ఆహ్వానం. ఈఆహ్వానాన్ని అంగీకరించి, ఒప్పుదల చూపినవాళ్లు ధన్యులు, సత్యలోకంలో వీళ్లు ప్రవేశిస్తారు. పరమశాంతి లభ్యమవుతుంది.

[జేమ్సు ఎలెన్‌ను అనుసరించి]




# పుష్పమాల

శ్రీమతి బి. సరోజనీదేవిగారు

పేరుగల వకీలు ప్రసాదరావుగారు. ఆయనకు చారుశీల ఒక్కర్తే కూతురు 8 సం॥ ప్రాయముగలది. చిన్నదయినప్పటికి ఇతరులకష్ట, సుఖములు బాగుగా గుర్తెరిగిన బాలిక. అందాలచిందేముఖము. ప్రసాదరావుగారి చెల్లెలుకొడుకు 12 సం॥ బాలుడు వినోద్. చిన్నతనములోనే తల్లి, దండ్రులను కోల్పోయిన అభాగ్యుడు. మేనమామ దగ్గరేవుండి చదువుకొంటున్నాడు. చారుశీల, తన బావను ఎంతో అప్యాయంగా ఆదరించేది. ఇద్దరు ఒకేకంచములోతిని, ఒకేమంచముమీద పండుకొనేవారు. కాని, ప్రసాదరావుగారి భార్యఅయిన కృపామతికి వినోద్అంటే ఏమిఇష్టములేదు. ఎప్పుడు ఏదో వంకపెట్టి ఆపిల్లవాన్ని సాధించేది. కాని వినోద్ మేనత్త ఎన్నికష్టములుపెట్టినా చారుశీల ముఖము చూచేసరికి అన్నికష్టాలు మర్చిపోయేవాడు. ఆరోజు దసరాపండుగ కృపామతి కూతురికి తలంటిపోసి, క్రొత్తబట్టలు కట్టింది, 'సరస్వతీపూజ చేసుకో, గులాబి పువ్వులు సజ్జలోవున్నాయి తీసుకో' అనిచెప్పి వెళ్లిపోయింది. చారుశీల గులాబిపుష్పాలు అన్నీ పెద్దమాలగా గుచ్చింది. ఇంతట్లోకి వినోద్ వాడినముఖముతో బట్టలు సర్దుకొంటున్నాడు. వినోద్నుచూచి చారుశీల మెల్లగా వెనకనించి వెళ్లి అతనిమెడలో ఆదండనలంకరించి అతని తల చేత్తో పైకి ఎత్తింది. అతని కళ్లంట నీరుచూచి గతుక్కుమన్నది. 'ఛా-అదేమిటి బావా! పండుగరోజు ఏడుస్తున్నావు?' అంటూ కళ్లనీళ్లు తనపరికిణీతో తుడిచింది. 'చారు! ఎంతపనిచేశావు? ఈదండనామెళ్లో నీవువేయవచ్చునా!' 'ఏంబావ చారుశీల నీకు ప్రియమైనదికాదా? పతిపూజచేయుట గృహలక్ష్ముల ధర్మంకాదా?' 'చారు నీవు చెప్పింది నిజమే. నన్నుయింటినుండి బయటకు వెళ్లిపొమ్మనమని అత్త ఆజ్ఞ?' 'ఆ-ఏమిటిబావా? నిన్ను మా అమ్మ యింట్లోంచి పొమ్మందా? అయితే నేను నీతో వస్తాను.' 'పిచ్చిదానా! చిన్నదానవయినా ఎంత జ్ఞానముంది చారు నేను ఎక్కడున్న అన్యకాంతను చేపట్టను. ఎప్పుడయితే ఈ పుష్పమాల నా మెడలోవేశావో అప్పుడే మన యిద్దరికి వివాహాము అయిపోయింది. ఈమాలపట్టుకొని ప్రతిజ్ఞ చేస్తున్నాను. ఎప్పటికయినా నీవే నాఅర్ధాంగివి.' అంటూ ఆమెను దగ్గరకు తీసుకొని కళ్లనీళ్లుతుడిచి వెళ్లిపోయాడు వినోద్.

* * *

చారుశీల యిప్పుడు 16 సం॥ యౌవ్వనవతి వినోద్ వెళ్లిపోయి 8 సం॥ అయింది. ఎక్కడవున్నాడో, ఏమో ? పెండ్లిసంబంధాలు చూస్తున్నారు తల్లి, దండ్రులు. కాని చారుశీల ఎవ్వరిని పెండ్లిచేసుకొనుటకు ఒప్పుకొనుటలేదు. చిన్ననాడు వినోద్, 'చారు నిన్నుతప్ప ఎవరిని పెండ్లిచేసుకోను గులాబిమాల సాక్షిగా చెపుతున్నాను' అన్నమాటలు చెవిలో గింగురుమంటున్నాయి. ఒకరోజు తల్లి కూతురుదగ్గరకు వచ్చింది. 'అమ్మాయి ఎన్నాళ్లు పెండ్లిలేకుండ వుంటావు. ఎదిగివున్నపిల్లను యింట్లోపెట్టుకొన్నందుకు అందరు తలోమాటా అంటున్నారు. వినోద్‌ని చేసికొందామని అనుకొంటున్నావు బాగుంది వాడు దరిద్రుడు. అయినా వాడు ఎక్కడకుపోయాడో, నామాటవిని ఇంకొకని చేపట్టి సుఖించు.' 'అమ్మా నేను యింకొక నూతనవ్యక్తిని వివాహాముచేసుకోలేను. చేసుకొంటే బావను చేసుకోవాలి, లేకపోతేనా జీవితంఅంతా బ్రహ్మచారిణిగానే గడుపుతాను. ఇంక నేను'...'చాల్లే ఊరుకో! చారుశీల, ఏమైననుసరే యింకొకసంబంధము నిశ్చయించి నీకు పెండ్లిచేయకతప్పదు' అంటూ కృపామతి జవాబుఅయినా వినకుండా వెళ్లిపోయింది. చారుశీల దుఃఖముతో మెల్లగా గదిలోనికివెళ్లి చిన్నప్పుడు తనపెట్టిలోదాచిన వినోద్ పోటోతీసింది. 'బావా ఎప్పటికయినా మనయిద్దరిహృదయాలు ప్రేమసూత్రంతో బంధింపబడతాయా ? హృదయమనే తోటలో జీవనమనేనీరుపోసి, ప్రేమఅనే బీజాలునాటి, ప్రణయమనే కుసుమముల వికసింపజేస్తామా?' అంటూ ఎంతసేపు దుఃఖించిందో ఆఅబల? చారుశీల రోజు, రోజు బెంగచేత కృశించిపోతోంది. మంచంమీదనుండి లేచుటలేదు. ఆ వూరికి క్రొత్తగా డాక్టరువచ్చాడు. ఆయన చాలామంచివాడని తెలిసి ఆయనకోసము బంట్రోతుని పంపించారు. డాక్టరువచ్చి రోగిని పరీక్షచేయుటకు దగ్గరకువచ్చి, థర్మామీటరుతీసి నోట్లో పెట్టుకోమన్నాడు. ఆమె ముఖముతిప్పింది డాక్టరు ఆమె ముఖము తేరిబారిచూచాడు. ఇంక చూడలేకపోయాడు. మందులసంచికూడ అక్కడమర్చిపోయి బయటకు వచ్చేశాడు. నౌకరు సంచిఅతనికారులోపెట్టాడు. మందుకురమ్మనమని చెప్పేసి వెళ్లిపోయాడు. డాక్టరు దయవల్ల చారుశీల ఆరోగ్యవంతురాలయింది. ప్రసాదరావుగారు, భార్యపోరువల్ల కూతురికి సంబంధము నిశ్చయించారు ఈమాట వినేసరికి చారుశీల చాల దుఃఖించింది. తనబావకు ద్రోహంచేస్తున్నామనుకొన్నది. కాని ఏమిచేయగలదు. పెండ్లి మహావైభవముగా చేశారు. కాని పెండ్లికొడుకుని తలఎత్తయినా చూడలేదు ఆమెకు తీవ్రముగా జ్వరమువచ్చేసింది. ఈకారణముచేత పెండ్లికొడుకు వుండకుండా వెళ్లిపోయాడు.

* * *

ఆరోజు దసరాపండుగ క్రొత్తఅల్లుని తీసుకొచ్చారు. చారుశీల మాత్రము గదిలోనుంచి బయటకురాలేదు. అతను తలంటి నీళ్లుపోసుకొని, క్రొత్తబట్టలుకట్టుకొని,

మెల్లిగా చారుశీలగదిలోకి వెళ్లాడు. ఆమె ఒక ఫోటో చేత్తోపట్టుకొని 'బావా సమంగా నీవువెళ్లిపోయి 10 సం॥ అయినది. ఈ దసరారోజుననేకదా నీకంఠమున పూలమాల అలంకరించి నిన్ను నాపతిగాచేసుకొన్నాను? బావా? నాహృదయములో ఇంకొకరికి స్థానంలేదు.' అని యింకా ఏదో అనబోతోంది ఆమె మెడలో గులాబిమాలపడింది, ఆమె తృళ్లిపడి అతన్నిచూచి బుజ్జ వంచేసుకొంది. కళ్లనీళ్లు గిర్రునతిరిగాయి, అతను మెల్లగా ఆమెగడ్డమునుపట్టుకొని 'చారుశీలా నన్నుమర్చిపోయావా? నీబావ వినోద్‌ను' 'ఆ! బావా? నీవేనా?' అంటూ అతనిహృదయముమీద వాలిపోయింది. 'చారు! ఏదసరారోజునఅయితే ఇద్దరము దుఃఖముతో విడిపోయామో, మళ్లీ ఆ దసరారోజుననే సంతోషముగా కలుసుకొన్నాము. ఆరోజు నీవు నామెడలో పుష్పమాలవేసినప్పుడు నిన్ను నా అర్ధాంగిగా చేసుకొంటానని ప్రతిజ్ఞచేశాను ఈరోజు ఈ పుష్పమాల నీమెడలోవేసి నా ప్రతిజ్ఞ నిలుపుకొన్నాను.' 'బావా నీవు అందుకుసమర్థుడవే?' 'చారు నీవుమాత్రముకావా? ఆ విషయములో ఇద్దరము సమర్థులమే!'

# వరకట్నాలు పోవాలంటే

"కనకం"



ప్రస్తుతము హిందూసమాజములో ఆచారంగా పరిగణింపబడు అత్యాచారాల్లో వరకట్న మెక్కువ ప్రాముఖ్యమైనదని చెప్పవచ్చు రానురాను ఈ వరకట్నాలొక వర్తకం (Business) గా మారింది. ఇందు లాభనష్టాలు, అదృష్ట దురదృష్టాలు. రోజు రోజుకూ యీ దురాచారం మరీఘోరంగా ప్రబలి పోతూంది చిట్టచివరకు వేలంపాట అయిపోయింది నోరులేని పశువుల్ని సంతపాకలో అమ్మితే యీ పశుతుల్యుల్ని యింటిదగ్గర బేరంపెడతారు.

వెనకటికో భావకవి 'ఆపలేనిబాధ అల్లుని బాధరా' అన్నట్లు చదువుకున్నవాడైనా శుంఠైనా, అమీరైనా పకీరయినా, బుద్ధున్నా-లేకపోయినా కట్నమియ్యవలసినదే లేకపోతే వరుడు దొరకడు. నిజానికి ఆడపిల్లను, ఆమెనుకన్న తలిదండ్రులు వీరిపాలిటి దీర్ఘ బానిసలు. అబ్బాయికేమీ లేకపోయినా సరే, స్కూలు ఫైనలు (S S L C) పరీక్షకు అటెండయి తేవాలు. వెయ్యిన్నూట పదహార్లివ్వాలి. అటువంటి ఫారాలు చదివినవాళ్లు నిరక్షరకుక్షులే. యీ స్వల్పరేట్లకు లభిస్తారు. Inter లో Join అయితే ధరపెరుగుతుంది. 2 ఎకరముల భూమిఉంటే 5 వేలు ఖరీదు. ఆలోచిస్తే ధనార్జన కిదికూడా ఒకమార్గమేమో? ప్రభుత్వము ఈ వరకట్న పిశాచాన్ని రూపుమాపుటకై ఒక చట్టముచేసి అమలులో పెట్టుటకు ప్రయత్నము చేస్తూన్నందుకు సంతసించవలసినదేకాని, 1500 రూ॥ వరకు పుచ్చుకోవచ్చునన్నారు. అది మాత్ర మేమంత న్యాయంగావుంది? పూర్తిగా కట్నాలెందుకు రద్దుచెయ్యకూడదు? ఈ కట్నాల ధర్మమా యని ఎన్ని కుటుంబాలు నాశనమవుతున్నాయో? ఎందరు పకీర్లవుతున్నారో? గమనించారా?

ఒక్క విషయ మాలోచించండి. విద్యారూపలావణ్యాదులందిరువురు (బాలబాలికలు) సమానంగా ఉన్నారుకదా. ఎందుకీ డబ్బిచ్చి కొనుక్కోడం? పోనీ యింతాకష్టపడి కొనుక్కుంటేమాత్రం ముడిపడే వరకు స్థిరమేది? వీళ్లఅదృష్టం బాగుంటే పైపాట వాళ్లెవళ్లోవచ్చి (గద్దపాట్లం తన్నుకుపోయినట్లు) తన్నుకు పోతారు మనపనిసున్నే. మళ్లీ వేలంపాట లెక్కడేస్తున్నారా - అని వెతుక్కుంటూ బయల్దేరాలి? ఈ సంవత్సరం మామిడికాయలకు పెరిగినట్లుగా పెరుగుతోంది కట్నాల ధర.

'అల్లుడుకర్థ'అంటే అదీ యేడువంకరలు తిరుగుతుందని సామెత. నిజంగాకూడా అడిగిన కట్నంపెట్టి అల్లుడ్నికొంటే వాడు వీళ్లపాలిటి దశమగ్రహంగా తయారవుతాడు. ఈ వేళ వాచీ కొనిస్తేనే మీ అమ్మాయిని తీసికెడతా, లేకపోతే వొదిలేస్తానంటాడు.

నిజానికిలా వేలకివేలు ఖర్చుపెట్టి పెళ్లిచేయుటకుబదులు ఆ ధనము వీళ్లకేయిచ్చి విద్యాబుద్ధులు చెప్పిస్తే వారి జీవితమెంత ప్రశాంతంగా గడుస్తుంది? ఇట్లందరూ చెయ్యలేకపోవచ్చు కాని వరుడ్ని డబ్బిచ్చి మేం కొనుక్కోం అనే యేకాభిప్రాయాన్కి రావచ్చు. ఆ పట్టుదల యున్నట్లయితే కట్నాల సమస్య చట్టాలక్కర్లేకుండానే తొలిగిపోతుంది. ప్రజాప్రభుత్వం ధాన్యానికి కంట్రోలుచేసింది. ఎక్కడైనా కంట్రోలు ధరలకి లభిస్తున్నాయా? చీకటి బజారుల్లో (Black-market) అమ్మకమయి పోతున్నాయి. అల్లాగే మనలో యీ మాత్రం పట్టుదలలేకపోతే గవర్నమెంటే యాక్టు (act) చేసినా యీ వరుళ్లుకూడ చీకటి బజారుల్లో చలామణి అయిపోతారు.

ఇంకో విశేషం. రెండోపెళ్లివాడయినాసరే, అరడజనుమంది పిల్లలున్నాసరే. ఏంచిన్నపిల్లాడే, పిల్లలంటే మాత్రం తన పిల్లలయితే పెంచదూ? ఇక ఆస్తి ఏమీ లేకపోతేమాత్రం చెంగూ చెంగూ పట్టుకు

ముస్తైత్తుకుంటారంటారు. ఇల్లాంటి సంబంధాలయితే కలిగేలాభం కట్నాలివ్వనక్ఖర్లేదు కట్నాలబాధపడలేక ఏ ముసిలాడినో చూసి ముడెట్టడం. రెండేళ్లయినా తిరక్కుండా పీడుచావడం. చివరికిమిగిలేది ఈఅమ్మాయి. ఈ విధంగా ధననాశనం, తిండిలేకపోవడం, కుచేల సంతానం. ఇటువంటి అక్రమాలకు బాధలేకపోగా మీదు మిక్కిలి 'పూర్వ సువాసిను' లంటూ కృష్ణాపత్రిక వడగళ్లలో (మే 3 వ తేదీ) వలె వ్యాసాలు వ్రాస్తుంటారు నవకవులు మనమే పనికైనా వెడుతూంటే యీ పూర్వపు సువాసినీ లెదురురాకూడదట. మనం నిద్రలేవగానే వారు మనకు కనపడకూడదట ఎందుకూ పనికిరాని యీ వితంతువులు 'ధాకిరీకి' మాత్రం చక్కగా పనికొస్తారా? దీనికి కూడక పోవడంలేదా అయితే భర్త చనిపోయిన స్త్రీని వితంతు వంటారే! భార్య చనిపోయిన పురుషుడినేమనాలి? వాడికి మళ్లీ పెళ్లిచేస్తారే. దీనికెందుకు చేయకూడదు పైగా ఒక వేళచేసుకుంటే II hand అనిహేళనా? వీడు III hand అయినా నిరభ్యంతరంగా చేసుకో వచ్చును. ఇటువంటి అన్యాయాలు పోవాలంటే, మహిళాలోకం ఆనందించాలంటే, కట్నాలు నశించాలంటే చెయ్యవలసిందేమిటి?

తమ పుత్రికలకు కట్నములిచ్చి వివాహముచేయుటకు గృహలక్ష్ములెవరు అంగీకరింపకూడదు. విద్యార్థినులెవ్వరూ అట్టి వివాహాల కిష్టపడకూడదు. అప్పుడే యీ కట్నాలనే చీడపురుగు నాశనమవుతుంది. అప్పుడే జీవితాలు సుఖప్రదమవుతాయి. ఇక పెళ్లిచేసేటపు డేడిగ్రీకాడిగ్రియే ఉండాలి. ఏక్లాసు కాక్లాసే. అంటే రెండో పెళ్లి అబ్బాయికి రెండో పెళ్లి అమ్మాయినీ (వితంతువు,) మొదటి పెళ్లి వానికి మొదటిపెళ్లి అమ్మాయినీ యివ్వాలి. అంతేకాని కాటికి కాళ్లు చాచుకొన్న మూఢుడికి ముక్కు పచ్చలారని ముద్దియ నివ్వకూడదు. అప్పుడే వితంతువుల సంఖ్యపూర్తిగా తగ్గుతుంది.

యువతీమణులారా! జీవితంలోఉండే కష్టసుఖాలు గుర్తించండి. తుచ్ఛసౌఖ్యాలకోసం మన తల్లిదండ్రులార్జనంతా పీల్చి పిప్పిచేసేవరుడ్ని కొనుక్కోడం మనకి మాత్రం చిన్నతనంకాదూ? వాళ్లకే విషయంలో మనం తీసిపోయాం? మనకాళ్లమీద మనం నిలబడే సామర్థ్యాన్ని సంపాదించాలి మనం రెండు విద్యలు నేర్చుకోవాలి, ధనార్జన నేర్చుకోవాలి; గృహనిర్వహణ నేర్చుకోవాలి. అంతేకాని ఏదో ఓపాతబోటొకటి కొనుక్కుంటే మాత్రము అది మన్ని గట్టెక్కిస్తుందా? నడిసముద్రంలో ముంచేస్తుంది.



# పసిపిల్లల లివర్, స్ప్లీను వ్యాధులకు అమోఘ ఔషధము.



పసిపిల్లల లివరు, స్ప్లీను వ్యాధులను కుదుర్చుటలో జమ్మి వారి 'లివర్ క్యూరు' అత్యవసరమైనది గనుకనూ, జగద్విఖ్యాతమైనది గనుకనూ, వైద్యశాస్త్రానికి మహా అక్కరయినది.

బహుక్లిష్టమైన లివరు, స్ప్లీను వ్యాధులందు ఇది దివ్యతరంగా అనుకూలించినది. ఈ జమ్మి వారి "లివర్ క్యూరు" గురించి ఇండియా యంతటనూ వైద్యప్రముఖులు అభివందనాలు తెల్పుచున్నారు.



జమ్మివారి

## లివర్ క్యూర్

అన్నిచోట్లా దొరకును

జమ్మి వెంకటరమణయ్య అండ్ సన్సు,
మైలాపూరు, మద్రాసు, ఫోన్ నం|| 8139
ఇతరచోట్లు: బెజవాడ, విజయనగరం, కలకత్తా, బొంబాయి, లక్నో, బెంగుళూరు, తిరుచునాపల్లి, etc

SISTA'S. J-233



# రక్తహీనతాబాధితులకు ప్రశస్తమైన ఆహారం.



బలహీనులకీ, రక్తహీనులకీ, ఆరోగ్యమిచ్చి, కళ్లలో చమకు, అవయవాలకి చలాకీతనమూ ప్రసాదించే టానిక్ రక్తోజ్. మాతకే గాక, శిశువుకికూడా, అవసరమయిన ఆహారం ఇస్తుందికనక, అప్పుడే ప్రసవించిన తల్లులకి, రక్తోజ్, మరీ ప్రశస్తమయిన టానిక్.





## రక్తోజ్

దక్కన్ ఆయుర్వేదాశ్రమ్ ఫార్మసీ లిమిటెడ్
హైదరాబాద్, దక్కన్.

SISTA'S DAY 534 TL






మద్రాసు డివిజన్ గరల్ గైడ్స్ శాఖవారు మద్రాసు గవర్నర్‌సతి శ్రీ శ్రీ శ్రీ భావనగర్ మహారాణీ సాహెబా వారిని ఆహ్వానించి గౌరవించినప్పుడు ఆమె వారి నిట్లని హెచ్చరించినది :—

ప్రపంచములో పలుప్రాంతాలలో వలెనే—భారతదేశంలో కూడా, గరల్ గైడ్స్ ఉద్యమం వ్యాప్తి చెందింది, క్రొత్త స్కీము ననుసరించి ఇంకా అభివృద్ధి చెందగలదని నా విశ్వాసము. మీ ముఖ్య సూత్రములు, 'భక్తి, సేవాసక్తి' నేను 'భక్తి' అన్నప్పుడు నా అర్థము, దేశభక్తి, ఈ సంస్థయందు భక్తి, సోదర గైడ్స్ యందు భక్తి. సేవాసక్తి అనగా — మీ శక్తి సామర్థ్యాలు మీకు గాక, మీతోడి వారికిని లాభకరముగా వినియోగించుట. మరో మాటలలో చెప్పవలెనంటె అది — స్వార్థమునకు వ్యతిరేకము. మీ రంతా ఈ విషయాలు మనసులో పెట్టుకొని కృషి చేయండి.-అని నా కోరిక.

సర్. రామారావుగారు అమెరికాలో భారతయూనియన్ రాయబారి. వారి శ్రీమతి రామారావుసతి గత 25 సం॥లనుంచి - భారతదేశంలో జరుగుతున్న మహిళోద్యమాన్ని గూర్చి - వాషింగ్టన్ నగరంలోగల అడ్వర్టైజింగ్ ఉమెన్స్‌క్లబ్‌లో ఇట్లుపన్యసించినది .—

స్త్రీలు అధిగమించవలసిన ఆటంకాలను పట్టిచూస్తే - అఖిలభారత మహిళాసభవారు సాధించ గలిగినది అత్యద్భుతమైనది. ఈ ఆటంకాలలో ముఖ్యమైనది- స్త్రీలవిద్యాపరిమితి, భారతదేశంలో చదువుకున్న స్త్రీలు 100 కి 2 రే దీనికికారణం బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టిన విద్యావిధానమే ఈ విధానానికి భారతీయ నైజ సంస్కృతికీ ఎక్కడా సంబంధంలేదు. అందుచేత స్త్రీలకుతాము దానికెడతొలిగి నిలవాలని తోచింది, ఏది భారతదేశానికి నైజమైనదో, ఏది బ్రిటిష్‌వారిచే క్రొత్తగా ప్రవేశపెట్టబడుచున్నదో వాని - మధ్య, తాము కడపటి లంకెగా ఉండవలెనని వారనుకున్నారు - మహిళామహాసభవారు నిర్మూలింపనుద్యమించిన సాంఘిక దురాచారములనబడేవన్నీ సదా దురాచారాలుగావు. ఉదాహరణానికి- బాల్యవివాహాలు పూర్వపురోజులలో, సమష్టికుటుంబాలలో ఆవసరమైయుండేవి. అప్పుడా బాలికకు పిదప భర్తసంసారంలో స్త్రీగా నిర్వహించవలసిన బాధ్యతలలో తర్ఫీదుపొందడానికి వివాహోత్సవం-ప్రౌఢ అయ్యేదాకాగల కాలంవినియోగమయ్యేది ఆ సమష్టికుటుంబవిధానం అంతరించగానే ఈ బాల్యవివాహాలున్నూ అనర్థమైనవి, సంఘసంస్కరణ పరాయణుల దృష్టి నీ సమస్య ఆకర్షించినది ఇంతకు మేము చేయవలసిన దానిలో శతాంశమైన చేయలేదు అయితే, ఇంతవరకు సాధించిన దానివిషయంలోను, ఇకసాధించవలసిన దాని విషంలోను, భారతనారీమణులు - ఉత్సాహులై, ఉద్రేకులై, ఆశాపూరితులైయున్నారు.

# లోక వార్తలు

ఇటలీలో నొకచోట నొకని భార్య చనిపోయినది. వాని స్నేహితులు 25 మంది ఆమె మృతియెడల సానుతాపము తెలుప నొకయింట సమావేశమైరి. అది కొండచరియ ప్రాంతము. కొండ విరిగి దిగజారినది; అందుచే 250 టన్నుల రాయియున్న ఆ యింటిపైపడి అణచివేయగా స్నేహితుని భార్య మృతికై చింతింప సమావేశమైన వా 25 మందియు దాని అడుగునపడి స్వర్గమలంకరించిరి.

*　　　　*　　　　*

ఇక గ్రుడ్డివాడును చదువ వీలగునట. అమెరికాలో ఎలక్ట్రానిక్ సాధనమొకటి కనిపెట్టబడినది. దీనిని "అప్టాఫోన్" అంటారు. దాని మూలమున గ్రుడ్డి వానికి అక్షరములు కన్పించుటకై-అక్షరముల వెంటనొక వెలుగుచుక్క ప్రసరించునట.

*　　　　*　　　　*

పాట్నానగరంలో ఒక ముసల్మాన్ దీపావళిరోజున జూదమాడినాడు చేతిలోఉన్న రూకలన్ని అయిపోయినవి. అంతట తన భార్యను ఒడ్డి ఓడిపోయినాడు. నిజంగా ఇతని నభినవ యుధిష్ఠిరుడు అనాలిగదా !

*　　　　*　　　　*

కత్తికి వివాహం జరిగిందనే కట్టుకథలెన్నో మన దేశంలో చెప్పుకుంటాము. అంతకన్నా వింతగాధ, వాస్తవం, ఇటీవల ఇంగ్లాండులో జరిగినది యార్క్‌షైర్‌లో ఒక యువతి యొక సుందర పురుషుని చూడడం తటస్థించినది. తర్వాత ఆ పురుషుడే వ్రాసినట్లుగా 9 నెలల కాలం ప్రణయలేఖలావిడకు వచ్చినవి. ఆ యువతి కతనియందనురాగం జనించినది వివాహం నిశ్చయమైనది, జరిగిపోయింది ఆ తర్వాత ఆ విడ అత్తగారివద్దనుంచి ఆ యువతికొక ఉత్తరం వచ్చినది. పూర్వపు ప్రణయలేఖలు వ్రాసినవారే ఈ ఉత్తరం వ్రాసినట్లు ఆ విడకు స్ఫురించినది. తీరా, ఆరా తీస్తే, ఆ యువతి భర్త అవ్యక్తుడు, వ్రాతచేతగాడు. ఆ ప్రణయ లేఖలను కుమారుని పేరట వ్రాపిన దతని తల్లేనట! తల్లిగదా, కడుపుతీపి! కల్లలాడి పిల్లవాని నొకయింటి వానిని చేతామనుకున్నది! అయితే ఆయువతి ఈ అవ్యక్తుని కట్టుకొని ఏమిసుఖిస్తుంది' విడాకులు కోరింది, కోర్టువారు అంగీకరించారు. ఇంగ్లీషు కోర్టులలో ఇలాంటి కేసుకిదే మొదలట.

*　　　　*　　　　*

మద్రాసు శాసన సభలో విజయవాడయందు 'స్పెషల్ సోడా' గా కల్లమ్మబడుచున్నదాయని ప్రశ్నింపబడినది. అచ్చట మద్యనిషేధ చట్టమములు నందున్నది.

*　　　　*　　　　*

వైకం (తిరువాన్కూరు) నివాసి ఉలహణ్ణన్ తన 15 సం॥ల కుమార్తెను తలిదండ్రులకు చెప్పకుండా

తీసుకొని వచ్చినాడని ఫాదిరీ జోసెఫ్‌మీద ఫిర్యాదుచేయగా ఆయన నరెస్టుచేసి సబ్ జైలులో నుంచారు. ఆ అమ్మాయి వంటిమీద రు 10000 ల నగలున్నాయట ఆమెను వెతుకను తండ్రి రు 8000 లు ఖర్చు పెట్టినాడట. ఆమె మద్రాసులో నొక కాన్వెంటునందు కన్పించినదట.

* * *

ఇటీవల జరిగిన అమెరికన్ ఎలక్షన్లలో డెమోక్రాట్ పార్టీ రు 50 లక్షలు ఖర్చుచేసినది; రిపబ్లికన్ పార్టీ రు 75 లక్షలు ఖర్చు చేసినది. ఏ పార్టీ అయినా కోటి రూపాయలకుమించి ఖర్చు చేయరాదట.

* * *

కోయంబత్తూరువాసి మణియమొదలి అనేవాడు తన భార్య కుంజమ్మాళ్ ఆసుపత్రిలో చికిత్స నందుచుండగా తమ బిడ్డను, 15 మాసముల శిశువును, రు 44-8-0 లకు ఒక కారు డ్రైవరు కమ్మినాడట. ఇప్పుడా డ్రైవరు తన పైకముతిరిగి ఇచ్చినగాని శిశువు నివ్వననుచున్నాడట. ఈ సంగతి నామె కోయంబత్తూరుజిల్లా కాంగ్రెసు కమిటీ వారికి ఫిర్యాదుచేసినది.

* * *

ఇటీవల కొన్ని సం॥ల కాల పరిమితిలో కన్పించనంత ఉజ్వలమైన తోకచుక్క చెన్నపట్నం రేవు సమీపంలో సముద్రంమీద కన్పించినది కుంభకోణం, షియ్యాళి పట్నాలలోకూడా కన్పించినది ఇంకా ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, అర్జెంటినా, మెక్సికో, న్యూజిలాండు-దేశాలలోకూడా ఇది కన్పించినది. కొన్ని దేశాలపై-ఇది శుక్రునికన్నా దీప్తితో వెలుగుచున్నదట.

---

(650-వ పుట తరువాయి)

ఆసలామె కాపురానికి రాగానే కష్టసహిష్ణుత కలవాటుపడ్డది. పట్టాభిగారు చిన్నప్పటినుండీ సంఘ సంస్కరణపరాయణులు. కుల, మత, వర్ణ, వర్గవివక్షత లాయన ఎన్నడున్నూ పాటించలేదు. ఛాందస పూర్వాచారాలు - ఆయన దరిదాపులకు రాలేదు. అలాంటివారు గాంధీయుగానికిపూర్వం ఎంత సంఘ బహిష్కారానికి గురిఅయ్యేంటారో చెప్పతరంకాదు. అబహిష్కారాన్నెదుర్కొను పురుషుని ధైర్యంకన్నా ఇల్లాలి స్థైర్యం హెచ్చుగా అవసరమై యుండేది. అలాంటి రోజులలో ఆమె ధైర్యస్థైర్యాలతో నిలువబడినది.

మహోద్యమంతో యథోచితంగా సహకారం చూపును. నిరంతరం ఖద్దరుధరించును. స్వయంగా వడకడం అలవాటు అప్పుడప్పుడు ఖద్దరువిక్రయం వగైరాలలో పాల్గొనుచుండును. అయితే, ఆమె వ్యవహారరంగంలోకన్నా, గృహాంగణంలోనే జీవిత పోరాటం సాగిస్తున్న వీరగృహలక్ష్మి.

ఈవిధంగా శ్రీమతి రాజేశ్వరమ్మ గారివంటి, అన్నిటా తనకనురక్తయైన ఇల్లాలిని-దైవమివ్వడంచేత ఆమె చలవన డాక్టరు, భోగరాజు పట్టాభిసీతారామయ్య పంతులుగారు ఈ50సం॥లగా - తనకునచ్చిన ఆదర్శాల చేబట్టి, ప్రజాహితజీవితంనడిపి - ఉత్తమ ప్రయోజనములసాధించి, - నేడు కాంగ్రెసు అధ్యక్షులై వెలయుచున్నారు. కావున-ఈఉత్తమ 'గృహలక్ష్మి' జీవితము గృహలక్ష్ములందరికి ఆదర్శప్రాయంగా ఇందు పొందుపరచినాను.

ఈ పుణ్యదంపతులు పార్వతీ పరమేశ్వరులవలె ఇష్టే చిరకాలము - ఆదర్శప్రాయులై వర్ధిల్లుదురుగాక.

# సంపాదకీయములు

## నైజాము భవిష్యత్తు

నైజాము రాజ్యము భారతయూనియన్ వారి యాజమాన్యమున సౌమ్యపరిస్థితులకు మరలుచుండగా నైజాము భవిష్యత్తునుగూర్చి యోచనలు సాగుచున్నవి. నైజాము అధికారభ్రష్టుడు కావలయుననియు, ఆ రాజ్యము భాషాప్రయుక్తముగ విభజనయై, సమీపభాషాప్రయుక్తప్రాంతములతో చేర్పబడవలయుననియు మా అభిప్రాయము. నైజాముపదభ్రష్టతను హైదరాబాదుప్రజలభిలషిస్తున్నారని హైదరాబాదుస్టేటుకాంగ్రెసు కార్యనిర్వాహకసభ్యులు శ్రీ ప్రాఫ్ గారనుచున్నారు. కల్లోలము రోజులలో రజాకర్లు చేసిన దుండగములు చెప్పతరముకాదు. మరికొన్నిప్రాంతములలో సర్వనాశనమైనదట. ఒక్క నాగలిలేదు, ఒక్క ఎద్దు కన్పించదు, పాత్రసామానులు మటుమాయము. ఈ సంవత్సరమున వ్యవసాయమే అసాధ్యము. ఈ విధముగా గ్రామీణప్రజల గృహములకు చిచ్చుపెట్టుటకు అవకాశమిచ్చిన నైజాము నేడు నక్కవినయములు చూపుచున్నాడు కదాయని అతని అధికారము రద్దుపరుపకుండుట న్యాయముకాదు. ఈ రజాకర్లు అంతర్గతమైనారే గాని అంతరించలేదు. వారింకను తమవద్దనున్న ఆయుధములను 40% దాచియేయున్నారట, మిలిటరీప్రభుత్వమున కప్పచెప్పలేదు. ఇంతేల, ఏ నిరంకుశపాలకుడు తనరాజ్యమున స్త్రీల నవమానపరచుట కంగీకరించెనో, లేక సహించెనో అట్టి పరిపాలకుని అధికారము ఏ సందర్భమునను నిలుపదగినదికాదు అని మా నిశ్చితాభిప్రాయము

## ఆటలు - స్త్రీలు

ఆటలలో ప్రపంచమున ప్రావీణ్యత నాటినాటికి హెచ్చుచున్నది. నిన్న గొప్పవిషయమైనది, నేడు సర్వసామాన్యమైనదిగా పరిణమించుచున్నది. నేడు ఆటలపోటీలందు స్త్రీలును సామాన్యముగా పురుషులతో తలపడి వారికన్న మెరసి మెప్పుపొందుచున్నారు. 1912 లో, ఫాన్నిడ్యూరాక్ అనే ఆస్ట్రేలియన్ బాలిక, ఈతలాడుటలో పందెము వేసినది. 100 మీటర్లదూరమును 1 ని||ము 22 2 సెకండ్లలో ఈదినదట. నాటి కది లోకవిడ్డూరము, పత్రికలవాళ్ళామె చాకచక్యముచూచి- "ఆమె" కాదు- "ఆయన" అని వ్రాసినారట! ఈ సం||న వెంబ్లిప్రదర్శనములందు 6 గురు బాలికలు ఈతపందెమున పాల్గొన్నారు. వారిలో నొకామె ఆ 100 మీటర్ల దూరమున్నూ 66 సె||లలోనే ఈదివేసినది, అన్ కర్టిస్ అనే ఆమెకు మూరుపందెమున 64 సెకండ్లేపట్టినదట. మన భారతీయ స్త్రీలును ఇట్టి ఆటలందు ప్రావీణ్యలు కావలయును. జలక్రీడ మనదేశమున ప్రాచీనకళ. దానిని పునరుద్ధరించుచో మన స్త్రీలందు చాల ప్రవీణులగుదురనట, నిస్సందేహము. ఈవిధముగ ఆటలందు ప్రవీణులైనవారి సంతానము తేజోజో బలసమన్వితమై దేశసంరక్షణ కుపకరించును.

## స్త్రీ బస్ కండక్టర్లు

మద్రాసునగరంలో స్త్రీలను 10 మందిని బస్ కండక్టర్లుగా నేర్పరచినట్లు వార్తవిని సంతసించుచున్నాము. ఈ పదిమందియు ఈ నెలాఖరులోగా ఉద్యోగముల స్వీకరింతురట. 25 మంది దరఖాస్తు దారులను సంప్రతించి వారినుండి ఈ పదిమందిని ఏర్పరచిరనగా ఎంతో జాగ్రత్తవహించి వీరిని ఎన్నిరని చెప్పవలసియున్నది. ఈవిధముగా స్త్రీలను కండక్టర్లుగా నేర్పరచుటగూర్చి మా అభిప్రాయము నిదివరకే

తెలిపియున్నాము. అయితే నేడు వారు ప్రత్యక్షముగా నేర్పాటైనారు గావున పురుషులగు ప్రయాణీకులను మర్యాదగ మసలుకొనుడని "గృహలక్ష్మి" హెచ్చరించునందులకు వారు కినియకుందురుగాక - ఈ క్రొత్త కండక్టర్లను 'ఎక్స్‌ప్రెస్ బస్సు'లలో ప్రవేశపెట్టుటయు. సమంజసము ఈ 'ఎక్స్‌ప్రెస్ బస్సు'లు ప్రత్యేకముగా ఆఫీసులకు వెళ్లువారి సౌకర్యార్థమై ఏర్పడినవి కావున వీరు స్త్రీకండక్టర్లయెడ మర్యాదగా ప్రవర్తించుటయేగాక ఇతర ప్రయాణీకులను అవసరమైన మందలించగలరు. మా సోదరీమణులకును చనవున ఒక్కమాట చెప్పదలచితిమి ; ప్రయాణీకులతో 'మితభాషణము' 'ఉచితప్రసంగము' - గావింపుడు. వీరి ఉద్యోగనిర్వహణము పరిశీలించినమీదటనే - ఇంకా యేర్పడబోవువారిని ఉద్యోగమున ప్రవేశపెట్ట వచ్చునని మా అభిప్రాయము. వీరు ప్రతినిత్యముగాని వారమునకొక్కసారిగాని యొకచో సమావేశమై తమ అనుభవములను పరస్పరమెరుకపరచుకొనుటయు ఈ ఉద్యోగధర్మనిర్వాహణకు హెచ్చుగా తోడ్పడ గలదు.

## తుపాను బాధితులయెడ సానుతాపం

దాదాపు ప్రతిసంవత్సరమున్నూ ఆంధ్రదేశమున ఏదోయొక ప్రాంతము తుపాను తప్పకున్నది ఈ మాసాంతమున బందరు బెజవాడప్రాంతముల గాలితోపాటు విశేషవర్షముకురిసినది ఒక్కవిజయవాడలోనే దాదాపు 9 దుక్కులవర్షముకురిసినది. అచ్చట ఎవ్వరును ఇంతవాన స్వయముగా చూచియెరుగరట. పల్లపు ప్రదేశాలన్నీ నీటిలోమునిగియున్నవి. బుడమేరు వెల్లువలై ఏలూరు, బెజవాడరోడ్డుపై బండ్లరాకపోకలే నిల్చిపోయినవి వరిపంటకు వేరుశనగకు చాలానష్టముకలుగునని తలంపబడుచున్నది. అసలే ఆహారసమస్య చేతను, ఇండ్లవసతి సమస్యచేతను - మనరాష్ట్రము చాలబాధపడుచుండగా - ఇట్లు, ఇండ్లకు, వరిపంటకు ప్రమాదకరమైన విపత్తుసంభవించుట విషాదకరము. ఎల్లరు బాధితులయెడ సానుతాపము కనుపరచవలసిన విషయము. ప్రభుత్వమువారును వెంటనే జాగరూకులై బాధితులకు తోడ్పడనిచో - ఒక్క అహారవసతుల బాధయేగాక - చెమ్మయుతోడుకాగా కలరా మున్నగు అంటువ్యాధులు సంభవించి ప్రజాసామాన్యము చాల కడగండ్లపాలగును. ప్రభుత్వమును, ధనాఢ్యులును విరివిగా సహకారమొనర్పదగును. బాధితులయెడ సానుతాపము నిండుమూలకముగ తెలుపుచున్నాము.

★  ★


## స్వతంత్ర: సాంవత్సరిక సంచిక

శ్రీ ఖాసా సుబ్బారావుగారి సంపాదకత్వమున వెలువడుచున్న ఆంగ్ల స్వతంత్రపత్రిక సాంవత్సరిక సంచిక అందంగా తయారై మా కార్యాలయానికంపబడినది. హరీంద్రనాథ చటోపాధ్యాయ, డా. పట్టాభి, పోతన్ జోసఫ్, ఫిలిప్ స్ప్రాట్ మున్నగువారు వ్రాసిన ఉత్తమవ్యాసములుకలవు హరీంద్రనాథుడు తనఅక్క సరోజినీదేవి - ఇంగ్లాండున ఒకసభలో - అల్లరిచేసిన బ్రిటిష్ సభ్యులను "నోరుమూయండి" అని అదలించిన ఘట్టము నద్భుతముగా వర్ణించియున్నాడు. చక్కని చిన్నకథలు, ఉజ్జ్వలమైన వ్యంగరచనలు, 'సాకా' గారికలంపోట్లు, ఎన్నోకల్గి ఈసంచిక చాల ఆకర్షణీయంగాఉన్నది ముఖచిత్రమున దేవగాయని యం. యస్. సుబ్బులక్ష్మిచిత్రము మొదలుగా, చక్కనిబొమ్మలతో నలరారుచున్నది. సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ రామగోపాల్ గారు భారతదేశంలోని వివిధరాష్ట్రీయులైన స్త్రీపురుషుల బొమ్మలను మనోహరంగా చిత్రించారు వాటినిచూస్తే రామగోపాల్ గారికి వారికుంచె ఎంతవశవర్తియో అనిపిస్తూన్నది. ఈసంచిక 100 పుటలకుమించినగ్రంథం - ఒకసారి తిరగద్రిప్పి ఆవల ఉంచదగినదికాదు, రోజులతరబడిచదివి నెమరు వేయదగిన హంశాలెన్నో ఇందున్నవి సంపాదకీయమున, మనస్సాక్షికి తలయొగ్గు పత్రికారచయితకుగల తీరని సమస్య - అది పత్రికారచయితగా సుబ్బారావుగారిదీర్ఘ జీవితమున పరిష్కారముగాని స్థిరసమస్యయే - సరసముగా ఇంచుక చర్చింపబడినది ధర రు 1-8-0 లు. వలయువారు - 156 లాయడ్స్ రోడ్డు, రాయపేట, మద్రాసు అనివ్రాయుడు.

## యుగధర్మ

చిరకాల కాంగ్రెసువాదియైన శ్రీ రెబ్బాప్రెగ్గడ మందేశ్వరశర్మగారి సంపాదకత్వమున క్రొత్తగా వెలువడిన "యుగధర్మ" అనే తెలుగు పక్షపత్రికను సంపాదకులు దయతో విమర్శనార్థమంపగా కృతజ్ఞతతో స్వీకరిస్తిమి ఇది వీరమందిరమునుండి వెలువడుచున్న పత్రిక. జాతీయపోరాటములో మృతులైన వీరులసంస్మరణం, కొండజాతులసమస్య మున్నగు, కొన్నిటినీపత్రిక చేబట్టినది సాలుచందా రు 3-0-0 విడిప్రతిక రు 0-2-0లు. వలయువారు, సంపాదకులపేరట కొవ్వూరు, పశ్చిమగోదావరిజిల్లా, అని వ్రాయండి.

## ఆంధ్రప్రతిభ

శ్రీ బాలాంత్రపు సత్యనారాయణరావుగారి సంపాదకత్వమున క్రొత్తగా కాకినాడనుండి వెలువడుచున్న తెలుగు జాతీయవారపత్రిక మా కార్యాలయమునకంపగా కృతజ్ఞతతో స్వీకరిస్తిమి. "ఆంధ్రప్రతిభ", పేరుదొడ్డపేరే! ఇటీవల "ఆంధ్రప్రతిభ" చెప్పుకోతగినంత ఏరంగానా విశేషం కానము. అయితే ఇకపై ఈ పత్రికారాజము ప్రబోధించగా "ఆంధ్రప్రతిభ" ప్రకాశించునని ఆశించుచున్నాము. శ్రీ బులుసు సాంబమూర్తిగారు దీనికి ప్రారంభోత్సవం చేశారు. ప్రకాశం, పట్టాభి, సి. ఆర్. రెడ్డి, కే. యస్. కేసరి మున్నగువారంతా సందేశాలంపారు. ఇవన్నీ శుభసూచనలు. అయితే ఈ పత్రికను, ముగ్గురు ప్రముఖులు - శ్రీయుతులు క్రొవ్విడి లింగరాజు, చాగంటి శేషయ్య, యర్రమిల్లి జగన్నశాస్త్రిగార్లు, సంపాదకీయవర్గముగా

అమరియున్నారు. వీరంతా వ్రాయగలవారే. "చాలామంది వంటవాండ్రు చేరి పులుసు తగలేశారు" అని ఒకసామెతఉన్నది. కాని ఆదోషమీపత్రికకు సోకదనే మేమనుకుంటున్నాము-సం॥ చందా రు 6-0-0 లు. విడిపత్రిక 0-2 0 (పోస్టేజీగాక) వలయువారు సంపాదకుడు, ఆంధ్రప్రతిభ, సూర్యారావుపేట, కాకినాడ అనేచిరునామాకు వ్రాయండి.

## అం కు శం

సుప్రసిద్ధ స్వాతంత్ర్య వీరులు శ్రీ అన్నాప్రగడ కామేశ్వరరావు ఎం. ఎల్. ఏ గారి సంపాదకత్వమున వెలువడుచున్న నూతన రాజకీయ వారపత్రిక-చక్కని వ్యాసములతోను, ఊహలతోను అలరారుచున్నది. కొంచము దుడుకు తగ్గించి తూకముతో వ్రాసినచో దీనికి మంచి పురోభివృద్ధికలదు. విడిపత్రిక రు 0 3-0. వలయువారు సంపాదకుని పేర గుంటూరు వ్రాయండి

# శ్రీ సర్వధారినామ సం॥ర కార్తీక, మార్గశిర మాసములు.

| | | | |
|---|---|---|---|
| | 16 | మం | పౌ ○ 42-10 భ 22-31 రా 25-4 వ్యాసపూర్ణిమా. |
| | 17 | బు | కృ. పా 42-51 కృ 24-40 |
| | 18 | గు | వి. 42-4 రో 25-40 ది 5-41 చాతుర్మాస్య ద్వితీయా అశూన్యశయన వ్రతం. |
| | 19 | శు | త. 40-3 మృ 25-41 రా 19-3. |
| | 20 | శ | చ. 36 59 ఆర్ద్ర 24-17 రా 25-17 సంకష్టహరణ గణేశవ్రతం. |
| నవంబరు | 21 | ఆ | పం. 32 47 పున 22-37 రా 13-7 |
| | 22 | సో | ష. 18-1 పుష్య 19-40 సోమనక్తవ్రతం. |
| | 23 | మం | స. 22-30 ఆశ్లే 15-52 రా 16-8 సావిత్రీ కల్పాదిః |
| | 24 | బు | అ 17-0 మ 11-47 రా 2-40 తిథిద్వయం |
| | 25 | గు | న. 11-5 పూఫ 7-41 ది 24-19 దశమీతిథిః. |
| | 26 | శు | ద. 4 51 ఉ ఫ॥ ఏకా॥ 54-19 ఉ ఫ 3-20. |
| | 27 | శ | ద్వా. 53-52 చి 55-40 ది 18.19 వైష్ణవానామేకాదశీ |
| | 28 | ఆ | త్ర. 49-9 స్వా 52-49 యమదీపోత్సవం. |
| 1948 వ సం॥ | 29 | సో | చతు. 45-31 వి 50 47 కార్తీకసోమనక్తవ్రతం. |
| | 30 | మం | అమా ● 42-39 అనూ 49-32 అమాతర్పణం. |
| | | | **మార్గశిర మాసము.** |
| | 1 | బు | శు. పా 41.2 జ్యే 49-36 |
| | 2 | గు | వి. 51-0 మూ 50-32 శ్రీవిద్యారణ్యారాధనం ఉత్తరశృంగ చంద్రోదయం. |
| | 3 | శు | త 41-1 పూ. షా 53-2 ది 16-1 గౌరీవ్రతం |
| | 4 | శ | చ. 43-56 ఉషా 56 25 వ 12-1 ఉదర సంపద్గౌరీవ్రతం |
| | 5 | ఆ | పం 46-18 శ్ర 60-0 నాగపూజా |
| | 6 | సో | ష. 50-39 శ్ర 1 36 చంపాస్కంద సుబ్రహ్మణ్యషష్ఠీ |
| | 7 | మం | స 55-39 ధ 7-12 ది 27-13. |
| | 8 | బు | అ 60-0 శత 13-14 రా 4-1 కాలభైరవాష్టమి. |
| డిశంబరు | 9 | గు | అ. 1-3 పూ భా 20-4 నందనవమీ. |
| | 10 | శు | న. 6-10 ఉ భా 26-13 రా 31-27. [ఉత్సవారంభః. |
| | 11 | శ | ద. 11-18 రే 32-4 శ్రీధరస్వామి నాం నారాయణాంజలిః గురుదత్తాత్రేయ |
| | 12 | ఆ | ఏ. 15-31 అశ్వ 37-3 సర్వేషాంమోక్షదైకాదశీ. |
| | 13 | సో | ద్వా 18-40 భ 41-2 ది 2-47. |
| | 14 | మ | త్ర. 19-50 కృ 43-41 శూన్యతిథిః శ్రీహనుమద్వ్రతం |
| | 15 | బు | చ. 20-52 రో 45-1 ధనుర్మాసపూజారంభం. |

Printed and Published by Dr S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd, 15, Westcott Road, Royapettah, Madras Editor Dr K N Kesari







# KERALA
## SOAPS
## of Distinction...

సుందర శ్రేణిని పెంపొందించుటలో కేరళ సబ్బులకు మించినవి లేవు. స్వచ్ఛము సహజసిద్ధమైన నూనెలు పరిశోధింపబడిన రసాయనికములు, పరిమళ పుష్ప సారములు—వీటితో తయారైన కేరళ టాయిలెట్ సబ్బులనే విచక్షణచేయు పురుషులు. సుందర స్త్రీలు, అందాలపాపలు మెచ్చుటతో ఎన్నుకొందురు.










**KERALA SOAP INSTITUTE...CALICUT.**

# గృహలక్ష్మి ఏజంట్లు:



గుంటూరు వెల్కం & కో.
చిత్తూరు. వి. చెన్నకేశవులు నాయుడు.
కర్నూలు బాలసరస్వతీ బుక్ డిపో.
బెజవాడ మాడరన్ న్యూసు ఏజన్సి.
కాకినాడ. సి. హెచ్చి నాగేశ్వరరావు.
అనంతపురము వై సాంబయ్య.
భద్రాచలం. టి. వి. జి. ఆర్. మూర్తి
దొమ్మగూడెం సి హెచ్చి బాపనయ్య.
గౌరిదేవిపేట వై. సత్యనారాయణ.
నర్సాపూరు వై. సుందరరామయ్య.
కావలి జి రంగయ్య.
మారుటేరు వి. వి సుబ్బారావు
గుడివాడ యం. రామమూర్తి పంట్.
పిఠాపురము యం నూకరాజు
కళ్యాణదుర్గం: కె మల్లప్ప
నిడదవోలు. కె. సి సి అయ్యర్
మచిలీపట్నము. టి. బి నారాయణసింగ్.
ఏలూరు నేషనల్ బుక్కుడిపో.
రాజమండ్రి నేషనల్ ఏజన్సీస్
తుని: కోడూరు నూకరాజు
బరంపురం కె.వి రంగారావు
విశాఖపట్నం: కె. సుందరేశ్వరరావు.
కనిగిరి కె యస్. శాస్త్రి
పర్లాకిమిడి బి. యన్. మూర్తి.
ఇచ్ఛాపురం కె గంగయ్య
బళ్ళారి: యస్. గురునాధ్

అనకాపల్లి: పి. వీరునాయుడు.
అకీడు: వి. లక్ష్మినారాయణ
భీమవరం: యన్. సూర్యనారాయణ.
పొన్నూరు చౌదరి ఖాదీస్టోర్సు
మదనపల్లి యన్. రాధాకృష్ణయ్య
అంబాజీపేట పి రామమూర్తి.
చికాకోలు: బి యన్. మూర్తి.
వసంతవాడ యస్. కె. శర్మ.
ఖర్గపూరు: యస్. వి. నాయుడు.
పార్వతీపురము ఎ. వి వి యన్. మూర్తి.
తిమ్మనచర్ల. రాయలసీమ న్యూసుమార్టు.
వాల్తేరు సిటి న్యూస్ ఏజన్సి.
చల్లపల్లి బి ఆంజనేయులు.
జగత్యాల కాసం, శివరాజగుప్త & సన్సు.
రంగూన్: నేషనల్ స్టోర్సు.
ఎలమంచిలి. కె ధీనులు
బాపట్ల. యల్. వి. మనోహరరావు.
నర్సిపట్నము. సి. రామం
జంషెడ్పూర్: యం. శ్రీరాములు
తాడేపల్లిగూడెం జి. సూర్యరావు.
మహబూబ్ నగర్ ముత్యాలు & సన్సు.
వేలూరు: ఎ. వెంకటశాస్త్రిగారు.
హైదరాబాద్ నవ్యాంధ్రా ఏజన్సీస్.
కదిరి: జి. సి కోదండరామయ్య.
గోకవరం వి. వి గోపాల్ రావు.
పామర్రు జి. లక్ష్మయ్య.

హిగిన్ బాథమ్ స్టాలులవద్ద దొరకును.


ఇతరచోట్ల ఏజంట్లు కావలయును డిపాజిటుతో దరఖాస్తుపంపుకోనుడు.